2. క్షయమగు జలము భూమి, స్వర్గపు సృష్టి ఎరుగును జలము స్తుతి వినును (జలము, భూమి, స్వర్గముకన్న ముందు పుట్టినదని)

3 విస్తీర్ణ జలము ఇంద్రుని ఆనంద పరచును ఉపద్రవము వచ్చినపుడు వీరులు, శూరులు ఇంద్రుని స్తుతింతురు

4 ఇంద్రుడు రావలసి ఉన్నది గుఱ్ఱములను రథముముందు కట్టండి ఇంద్రుడు వజ్రధరుడు స్వర్ణహస్తములవాడు

5 మానవులారా ! యజ్ఞమునకు సాగండి గంతవలె స్వయముననే యజ్ఞమార్గమున సాగండి

6 మజనులారా ! యుద్ధమునకు స్వయముగానే వెళ్లండి జనుల కొఱకు ప్రజ్ఞాపకము పాపనాశకమగు యజ్ఞము చేయండి

7 ఈ యజ్ఞ బలముననే సూర్యుడు ఉదయించును భూమి ప్రాణులను మోయును అట్లే యజ్ఞము సహితము భారము వహించును

8 అగ్నీ ! అహింసాదియుక్త యజ్ఞము చేయుదును కోరికలు తీర్చుకుందును పిలిచెదను వారికొఱకు కర్మ చేయుదును

9 మానవులారా! దేవతలు లక్ష్యముగా దీప్త కర్మ చేయండి దేవతలను స్తుతించండి

10 ఓజసి, బహునేత్రుడు, వరుణుడు నదుల జలమును పరిశీలించును

11 వరుణుడు దేశములకు రాజు నదులకు రూపము అతని బలము అప్రతిహతము సర్వత్రగామి

12 దేవతలారా ! సకల ప్రజలలో మమ్ము రక్షించండి నిందించ గోరు శత్రువును దీప్తిరహితునుచేయండి

13 శత్రువులు అశుభంకర ఆయుధముల నలువైపుల తొలగిపోవలెను దేవతలారా ! మాలోని పాపము తొలగి పోవలెను

14 హవ్యభోజి అగ్నీ ! మా నమస్కారములకు ప్రీతుడవగుము మమ్ము రక్షింపుము మేము అగ్నిని సుతింతుము

15 అగ్ని దేవతల సహచరుడు అతనితో స్నేహము చేయండి అతడు మనకు శుభంకరుడు కావలెను

16 మేఘహంతా ! నదీ స్థానమున కూర్చున్నవాడును జలమున ఉత్పన్నుడగు అగ్నిని స్తోత్రములతో స్తుతింతురు

("ఋధ్నే నదీరాం" అని మంత్రం బుధ్నమనగా అంతరిక్షము ధృతా ఆప ఇతి ఉత్పత్తిః)

17 అహిర్బుధ్న్యా! మమ్ము హింసకునకు వప్పగించకుము యాజ్ఞికుని యజ్ఞము క్షీణింప చేయకుము (అహిర్బుధ్న్య గార్హపత్య అగ్ని గృహములందలి అగ్ని)

18 దేవతలు మాజనులకొఱకు అన్నము ధరింతురు ధనముకొఱకు ఉత్సాహులగు శత్రువు చావవలెను

19 సూర్యుడు సమస్త భువనములను తపింప చేయును అట్లే దేవతల బలమువలన మహాసేనగల రాజు శత్రువులను తపింప చేయును

20 మా వద్దకు దేవతాస్త్రీలు వచ్చినపుడు ఉత్తమ హస్త నిపుణుడు త్వష్ట మాకు వీరపుత్రులను ప్రదానము చేయవలెను

21 త్వష్ట మా స్తోత్రములను స్వీకరించును పర్యాప్త బుద్ధిగల త్వష్ట మా కొఱకు ధనాభిలాషి కావలెను

22 దాననిపుణులగు దేవపత్నులు మా మనోరథములను ప్రదానము చేయవలెను ద్యావాపృథ్వులు, వరుణ పత్ని సహితము వినవలెను శుభంకరుడు, దానశీలుడగు త్వష్ట ఉపద్రవ నివారణులగు దేవపత్నుల సహితుడై మాకు అభయము ఇవ్వవలెను

23 అవ్యయములగు మా ధనములను పర్వతములు పోషించవలెను సమస్త జలములు ఆ ధనమును పోషించవలెను దాన పరాయణులగు దేవపత్నులు దానిని పోషించవలెను ఓషధులు ద్యులోకము సహితము పాలన పోషణ చేయవలెను వనస్పతులు సహితమయి అంతరిక్షము సహితము పాలించవలెను ద్యావాపృథ్వులు మమ్ము రక్షించవలెను

(అవ్యయ ధనములు ప్రకృతి సంపదలు వాటికి స్వయముగా పునరుత్పత్తి ఉన్నందున అవ్యయములయినవి ఆధునికమను పేరుగల రాక్షస నాగరకతలో పునరుత్పత్తిగల ప్రకృతి సంపదల ఉత్పత్తిని నాశనము చేయు ప్రయత్నము నిరంతరము జరుగుచున్నది)

24 మేము భరించ తగిన ధనమునే ఆశ్రయింతుము విస్తృత ద్యావాపృథ్వులు దానిని ఆమోదించవలెను దీప్తికి ఆధారభూతుడగు ఇంద్రుడు మిత్రుడగు వరుణుడు ఆమోదించవలెను పరాజయకర్తలు మరుద్గణములు సహితము ఆమోదించవలెను

(ధియధ్యైః భరించ కలిగింత ధనము మాత్రమే ఉండవలెను అది ప్రకృతి శక్తుల అనుమతి గలది కావలెను ఈ యంత్ర నాగరకతకు పట్టిన రోగము ప్రకృతి అనుమతిలేని భరించలేని ధనము! ఇది పులిని ఎక్కినది స్వారి చేయలేదు దిగలేదు ఆశ్చర్యమేమనగా ఆనాటి ఋషులు నేటి మానవుని హెచ్చరించినాడు )

25 ఇంద్ర, వరుణ, మిత్ర, అగ్ని, జల, ఓషధ, వృక్షములు మా స్తుతులను స్వీకరించవలెను మరుత్తుల వద్ద నివసించి మేము సుఖింతుము యూయం పాత స్వస్తిభిః సదానః

(గాలి వద్ద కన్న సుఖము మరెక్కడ లభించును?)

## ముప్పది ఐదవ సూక్తము
### ఋషి-వసిష్ఠుడు, దేవత-విశ్వేదేవతలు, ఛందస్సు-త్రిష్టుప్

1 ఇంద్రాగ్నులారా! మాకు రక్షణలు కల్పించండి శాంతి ప్రసాదించండి ఇంద్రావరుణులారా! యజమాని హవ్యము సమర్పించినాడు మీరు మాకు శాంతి ప్రసాదించండి ఇంద్రసోములు మాకు శాంతి, శుభములు ప్రసాదించువారు కావలెను ఇంద్ర, పూషలు మాకు శాంతి, సుఖములు ప్రసాదించవలెను

2 భగుడు మాకు శాంతిని ఇవ్వవలెను నరశంసాగ్ని మాకు శాంతి ప్రదుడు కావలెను మాకు పురంధ్రి శాంతి ప్రద కావలెను సకల ధనములు మాకు శాంతి ప్రదములు కావలెను ఉత్తమము నియమయుక్త సత్యవచనము మాకు శాంతి ప్రసాదించవలెను బహుమారులు అవిర్భూత ఆర్యమ మాకు శాంతి దాత కావలెను

3 ధాత మాకు శాంతిని ఇవ్వవలెను ధర్త వరుణుడు మాకు శాంతిని ఇవ్వవలెను పృథ్వి అన్న సహితముగా శాంతి ఇవ్వవలెను మహాంతములగు ద్యావాపృథ్వులు మాకు శాంతి ఇవ్వవలెను పర్వతము శాంతి ఇవ్వవలెను దేవతల సకల ఉన్నత స్తుతులు శాంతి ఇవ్వవలెను

4 జ్వాలాముఖాగ్ని మాకు శాంతి ప్రసాదించవలెను మిత్రావరుణులు శాంతి ప్రసాదించవలెను అశ్వినులు శాంతి ప్రసాదించవలెను పుణ్యాత్ముల పుణ్యకర్మలు శాంతి ప్రసాదించవలెను గతిశీలమగు వాయువు సహితము శాంతముగా వీచవలెను

5 ప్రథమ ఆహ్వానముననే ద్యావాపృథ్వులు మాకు శాతి కలిగించవలెను దర్శనీయ అంతరిక్షము మాకు శాంతి కలిగించవలెను ఓషధులు, వృక్షములు మాకు శాంతి కలిగించవలెను విజయ పరాయణుడగు లోకపతి ఇంద్రుడు సహితము మాకు శాంతి కలిగించవలెను

6 వసువులతో కలిసి ఇంద్రుడు మాకు శాంతి అనుగ్రహించవలెను ఆదిత్యులతో కలిసి శోభనస్తుతుల వరుణుడు మాకు శాంతి అనుగ్రహించవలెను రుద్రుగణముల కొరకు రుద్రుడు మాకు శాంతిని అనుగ్రహించవలెను దేవతాస్త్రీలతో త్వష్ట మాకు శాంతిని అనుగ్రహించవలెను యజ్ఞము మా స్తోత్రము వినవలెను

7 సోముడు మాకు శాంతి అందించవలెను స్తోత్రము మాకు శాంతి అందించవలెను శిలలు

మాకు శాంతి అందించవలెను యూపముల కొలతలు మాకు శాంతి అందించవలెను ఓషధులు మాకు శాంతి అందించవలెను వేదము మాకు శాంతి ప్రసాదించవలెను

8 విశాల తేజోవంతుడగు సూర్యుడు మా శాంతి కొఱకు ఉదయించవలెను నాలుగు మహాదిశలు మాకు శాంతి ప్రసాదించవలెను స్థిర పర్వతములు మాకు శాంతి ప్రసాదించవలెను నదులు మాకు శాంతి ప్రసాదించవలెను జలములు మాకు శాంతి ప్రసాదించవలెను

9 కర్మద్వారా అదితి మాకు శాంతినీయవలెను శోభన స్తుతులు గల మరుత్తులు మాకు శాంతి నీయవలెను విష్ణువు మాకు శాంతినీయవలెను పూష మాకు శాంతినీయవలెను అంతరిక్షము మాకు శాంతినీయవలెను వాయువు మాకు శాంతి నీయవలెను

10 రక్షించుచు సవిత మాకు శాంతి అనుగ్రహించవలెను చీకట్లను దూరము చేయు ఉషస్సులు మాకు శాంతి అనుగ్రహించవలెను మా ప్రజకు పర్జన్యుడు శాంతి అనుగ్రహించవలెను క్షేత్రపతి శంభుడు మాకు శాంతి అనుగ్రహించవలెను

11 ప్రకాశమానులగు విశ్వేదేవతలు మాకు శాంతి అందించవలెను కర్మతో పాటు సరస్వతి మాకు యజ్ఞసేవక శాంతి నందించవలెను దాననిపుణులు మాకు శాంతి నందించవలెను భూలోక, ద్యులోక, అంతరిక్షములందు పుట్టిన జీవములన్నియు మాకు శాంతి నందించవలెను

12 సత్యపాలక దేవతలు మాకు శాంతిని ప్రసాదించవలెను అశ్వగణములు మాకు శాంతి ప్రసాదించవలెను గోవులు మాకు సుఖములనిచ్చునవి కావలెను సుకర్మ కర్తలు, సుందరహస్తులు ఋభువులు మాకు శాంతిని ప్రసాదించవలెను స్తుతించినపుడు మా పితరులు సహితము మాకు శాంతిని ప్రసాదించవలెను

13 అజ ఏకపాదదేవా ! మాకు శాంతినిమ్ము అహిర్బుధ్న్య దేవా ! మాకు శాంతినిమ్ము ఉపద్రవ శాంతి కారక అపాం నపాత, దేవా ! మాకు శాంతినిమ్ము దేవపాలిక పృశ్నీ ! మాకు శాంతినిమ్ము

14 మేము ఈ కొత్త స్తోత్రము రచించినాము ఆదిత్య గణ, రుద్రగణ, వసుగణములు దీనిని స్వీకరించవలెను ద్యులోక, భూలోక, పృశ్ని జాతములన్నియు మిగిలిన యజ్ఞీయములన్నియు మా ఆహ్వానము వినవలెను

15 యజ్ఞ, యోగ్య దేవతలు, యజనీయమను ప్రజాపతి, యజనీయ, అమర సత్యజ్ఞ దేవగణములు నేడు మాకు బహు కీర్తనీయ పుత్రుని ప్రదానము చేయవలెను నీవు మమ్ము ఎల్లపుడు శుభములు కలిగించి పాలింపుము

**ఆలోచనామృతము**

ఆదిత్యా రుద్రా వసవో జుషంతేదం బ్రహ్మ క్రియమాణంనవీనం।
శ్రుణ్వంతునో దివ్యాః పార్థివాసోగోజాతా ఉతయే యజ్ఞియాసః॥

ఇది ఈ సూక్తము పదునాలువ మంత్రము *"ఇదం బ్రహ్మక్రియమాణం నవీనం"* ఇది కొత్తగా రచించిన సూక్తము అనుచున్నాడు

ఈ సూక్తము అందమయినది సుందరమైనది సురుచిరము మనసున పులకింపచేయునది ఆనందకరము హర్షదము స్పందింప చేయునది కొన్ని పదములు, మనసును కదిలించును కొన్ని ఏడిపించును

కొన్ని బాధించును కొన్ని నవ్వించును పదములకు ప్రాణము లేక పోవచ్చు శక్తి ఉన్నది అని మనిషిమీద మనసుమీద అనంతమగు ప్రభావము వేయగలవు

శాంతి, ఇది ఆప్యాయమగు పదము ఉచ్చారణ మాత్రమున మనసున మల్లెలు మొలుచును ఏదో చెప్పలేని అవ్యక్త, అనుభూతి చోటుచేసుకొనును పచ్చని పంట చేలు, నల్లనికారు మబ్బు, మెల్లగాపారు ఏరు, మెల్లని పిల్లగాలిని తలపించును

కొన్ని పదములు మాత్రమే ఉండును వాస్తవమున ఉండవు శాంతి అటువంటి పదము అది మానవాళికి ఈ నాటికి అందలేదు ముందు అందగలదని నమ్మకము లేదు ఏలననగా మనిషి, మనసు ప్రకృతి అలజడిగలవి వాటికి నిలకడలేదు అందుకే శాంతికి నిలకడలేదు

శాంతి అందదు అందుకని అందమయినదికాదు అందనిప్రతిది అందముకాదు

మానవ జీవితము మరీచిక దానికి అన్నీ కనిపిస్తాయి వాటివెంట పరుగే జీవితము మనిషికి నిశ్చితముగా అందునది మృత్యువు మాత్రమే జీవితము అనిశ్చతము మృత్యువు నిశ్చితము

మానవుని జీవితము వాస్తవము సత్యము, ఋతము మీద ఆధాపరపడినదికాదు అది ఆదర్శము లక్ష్యము గమ్యము మీద ఆధారపడినది మానవుడు ఏనాటికయినా ఆదర్శమును అందుకొనగలడా? అదొక ప్రశ్న, మానవ జీవితము ప్రశ్నల తోరణము అన్నింటికి సమాధానము ఉండదు

ఇంతకుముందటిసూక్తములు సుఖములను కోరినవి ధనమును కోరినవి అన్నమును కోరినవి బలమును కోరినవి శాంతిని ఆశించలేదు

మానవ జీవిత ప్రయాణమున ఇదొక మరువరాని మజిలీ ! అన్నము, బలము మున్నగునవి సుఖమును ఇవ్వలేకపోయినవి అందుకే అన్వేషణ ఆ నిరంతర అన్వేషణలో వశిష్ఠుని ఊహా

పథమున శాంతి గోచరించినది అతడు ఆ ఉత్సాహమున, ఆవేశమున, ఆనందమున వచించిన సూక్తమిది అందుకే *"ఇదం బ్రహ్మక్రియమాణం నవీనం"* అన్నాడు బ్రహ్మ అనగా మంత్రము సూక్తము

శాంతము లేదా సౌఖ్యము లేదన్న మన త్యాగయ్య వశిష్ఠున కన్న తక్కువాడుకాడు

శాంతి పదము చిన్నది అర్థము అనంతము శాంతి స్వతంత్రంకాదు పరాధీన శాంతి ఒకచోటిది కాదు పెక్కుచోట్లది శాంతి బాహిరము మాత్రమేకాదు అధికముగా ఆంతరంగికము

శాంతి అందదు ఎందుకు? అది ప్రకృతి మీద ఆధారపడినది పరిసరములు మీద ఆధారపడినది పరిస్థితులమ మీద ఆధారపడినది రాజకీయముమీద ఆధారపడినది మనిషిమీద ఆధారపడినది మనసు మీద ఆధారపడినది ఇవి భిన్నములు పొంతనలేనివి అందని శాంతిని అందదని మిన్నకుండ జాలము ! నిరంతర యత్నములు కొనసాగుచునే ఉన్నవి-ఉండును

శాంతికొఱకని సాగిన యుద్ధములెన్ని? శాంతి కొరకని చెలరేగిన అశాంతి ఎంత?

ఈ హింస, ఈ అశాంతి ఎవరికొరకు? ఒక నియంత కొరకా? ఒక రాచరికము కొరకా? ఒక మతము కొరకా? ఒక విధానము కొరకా? ప్రజలను శాంతిగా బ్రతకనీయకుండుట కొరకా?

ఎవని నిర్వచనము వానిది! ఒకనికి అశాంతి మరొకరిశాంతి ఇదికూడ సాపేక్షమే మానజాతిని ఉద్ధరించుటకని పుట్టిన సిద్ధాంతములలో చాల వరకు ఆదర్శముగనే నిలిచిపోయినవి శాంతి సహితము అటువంటిదే

అటువంటి శాంతి ఎన్నింటిమీద ఆధారపడినది ఈ సూక్తము చెప్పినది శాంతి కొఱకు తపించినది ఈ సూక్తపు ఉచ్చారణలో శాంతి ఉన్నది *"మహానామ్నివర్తే ఏతత్స్తోత్రం జప్యం"* అన్నాడు శాయణుడు.

వాస్తవ జీవితముకన్న పదములు వాటి స్వరములు ఉచ్చారణలు ప్రభావము ఎక్కువ అందుకే ఈ సూక్తపు మొదటి మంత్రము ఉచ్చరింతము

*"శంన ఇంద్రాగ్నీ భవతామవోభిః ॥శం"* ఇంద్రావరుణా రాతహవ్యా

శమింద్రాసోమా సువిత యసంమోః శంన ఇంద్రాపూషాణా వాజాసాతౌ

*(ఆంధ్ర వచన ఋగ్వేద సంహిత ఏడవ మండలము ఐదవ అష్టకమున మూడవ అధ్యాయము సమాప్తము)*

ఋషి-వసిష్ఠుడు, దేవత-విశ్వేదేవతలు ఛందస్సు-త్రిష్టుప్.

1 యజ్ఞస్థానము నుండి స్తోత్రములు శ్రేష్ఠముగా సూర్యాదులవద్దకు చేరవలెను తన కిరణములతో సూర్యుడు వర్షజలమును ఏర్పరచినాడు భూమి తన సానువులమీద విస్తృతమై వ్యాపించి ఉన్నది పృథ్వి యొక్క విస్తృత అవయవములమీద అగ్ని జ్వలించును

2 బలవంతులగు మిత్రావరుణులారా ! హవ్యరూప అన్నమువంటి కొత్త స్తుతిని మీ కొఱకు రచిస్తాను మీ ఇద్దరిలో వరుణుడు స్వామి స్థానము కల్పించువాడు మిత్రుడు స్తుతించగా ప్రాణులను ప్రవర్తింపచేయువాడు

3 కదలికగల వాయువు నడక నలువైపుల శోభిల్లును పాడి ఆవు వర్థిల్లును ప్రకాశమానుడగు ఆదిత్యుని అంతరిక్షమున మేఘము ఉత్పన్నమగును ఆ మేఘము జలవర్షకమై అంతరిక్షమున గర్జించును

4 శూర ఇంద్రా ! నీ అశ్వములు హరినామకములు సుందరగమనములు కలవి భారము వహించగలవి వానిని స్తుతలతో రథమున పూన్చువాని యజ్ఞమునకు విచ్చేయుము ఆర్యమ హింసించగోరు శత్రువు కోపమును నష్టపరచును శోభన కర్మలుగల ఆర్యమను స్తుతితో ఆవర్తితము చేయుదును

5 యజమానులు అన్నవంతులయి, యజ్ఞ స్థలమున నిలిచి రుద్రుని సఖ్యత కోరుచున్నారు నేతల స్తుతులు విని రుద్రుడు అన్నము అందించవలెను నేను రుద్రునకు ప్రియ నమస్కారము చేయుదును

6 నదులకు సింధునదిమాత సరస్వతి సప్తమ ఆ నదులు కోటికలు తీర్చునవి సుందర ధారలు కలవి ప్రవహించునవి తమ జలములతో పొంగునవి, అన్నవంతములు కోరికలుగల నదులులన్నియు ఒకేసారిరావలెను

7 మరుత్తులు ప్రసన్నులు వేగవంతులు వారు మా యజ్ఞకర్మను పుత్రులను రక్షించవలెను అక్షర వ్యాప్తమయి, సంచరించు వాగ్దేవి మమ్ము విడువరాదు ఇతరులను చూడరాదు మాధనము నియతము అయినను మర్తుతులు వాగ్దేవి దానిని పెంచవలెను

8 మహతి, అసీమ భూమిని పిలువుము యజ్ఞయోగ్య వీరపూషను పిలువుము మా కర్మలను రక్షించు భగుని పిలువుము దాన నిపుణుడు, ప్రాచీనుడు ఋభువులలో ఒకడు వాజీదేవుని యజ్ఞమునకు పిల్వుము

9 మరుత్తులారా ! ఈ శ్లోకము మీ ముందునకు చేరవలెను ఆశ్రమదాత, గర్భపాలక విష్ణువు వద్దకు కూడ చేరవలెను వారు స్తోతకు, పుత్రులు, అన్నము ప్రసాదించవలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## ముప్పది ఏడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుదు, దేవత-విశ్వేదేవతలు ఛందస్సు-త్రిష్టుప్.

1 విస్తృత తేజము ఆధారముగా గల ఋభువులారా! వాహకము, కీర్తనీయము, అహింసరథము మిమ్ము మోయవలెను సుందర హనువులుగల ఋభువులారా! యజ్ఞమందు ఆనందమునకుగాను పాలు, పెరుగు, సత్తు కలిసిన సోమముతో కదుపునింపండి

2 స్వర్గ దర్శులగు ఋభువులారా ! మీరు హవిష్మంతులకొఱకు అహింసక రత్నములను ఉంచండి అనంతరము బలము కలుగు యజ్ఞమున సోమపానము చేయండి దయదలచి మాకు విశేష రూప ధనమును అందించండి

3. ధనికుడవగు ఇంద్రా ! నీవు అధిక , అల్పధన దాన సమయములందు ధనమును సేవింతువు నీ రెండు చేతులనిండ ధనము ఉన్నది ధనప్రాప్తియందు నీ మాట కటువుకాదు

4 ఇంద్రా ! నీవు అసాధారణ యశోవంతుడవు ఋభువులకు ఈశ్వరుడు సాధకుడవు ఇతురులవలె నీవు స్తోత ఇంటికి రమ్ము హర్యశ్వ ఇంద్రా ! నేడు మేము హవ్యము అర్పించి మిమ్ము స్తుతించుచున్నాము

5 హర్యశ్వా ! నీవు మా స్తుతివలన వ్యాప్తిచెందుదువు హవ్యము అర్పించు యజమానికి ప్రవహించు ధనము ఇమ్ము ఇంద్రా ! నీవు మాకు ధనము ఎప్పుడు ఇచ్చెదవు? నేడు నీకు యోగ్యముల రక్షణలతో మేము పాలితులమగుదుము

6 మా స్తోత్రరూపవాక్యమును ఎప్పుడు అర్థము చేసికొందువు? ఇప్పుడు నీవు మాకు నివాసము ఇచ్చుచున్నావు బలము కలిగి వేగవంతములగు నీ అశ్వములు మా స్తుతులు విని వీరపుత్ర సహిత ధనమును అన్నమును మా ఇంటికి తేవలెను

7 ప్రకాశమానమగు భూమి ఇంద్రుని అధిపతిని చేయుటకు వ్యాపించును విశిష్ట అన్నముగల వర్షము ఇంద్రుని వ్యాపించచేయును మానవులు ఇంద్రుని స్తుతించి తమ ఇంటికి తీసికొని వెళ్లుదురు అట్టి త్రిలోకధారి ఇంద్రుడు జరరాగ్ని కలిగి ఉండును

8 సవితా ! నీ వద్దనుంచి ప్రశంసనీయ ధనము మావద్దకు చేరవలెను పర్వతములు అందించిన ధనము మావద్దకు చేరవలెను సర్వరక్షకుడు, స్వర్గవాసి ఇంద్రుడు మాకు రక్షకుడు కావలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## ముప్పది ఎనిమిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుదు, దేవత-సవిత ఛందస్సు-త్రిష్టుప్.

1. ప్రభ స్వర్ణమయము సవిత దానిని ఆశ్రయించును దానినే ఉదయింపచేయును సవిత

మానవులకు స్తుతింపతగినవాడు అతడు అనేక ధనములు కలవాడు స్తోతలకు మనోహర ధనము ఇచ్చును

2 సవితా ! ఉదయింపుము నీవు హిరణ్య బాహువవు విస్తృతము, ప్రసిద్ధమగు వెలుగు ఇచ్చుచున్నావు మానవుల భోగ యోగ్యమగు ధనము నేతలకు ఇచ్చునట్టి యజ్ఞము ప్రారంభమైనది నీవు మా స్తోత్రము వినుము

3 సవితను మేము స్తుతించవలె, సవితను సమస్త దేవతలు స్తుతింతురు ఆ పూజనీయ సవిత మా స్తోత్రమును అన్నమును స్వీకరించవలెను సర్వ రక్షణలతో స్తోతలను పాలించవలెను

4 సవిత అనుమతి ప్రకారము అదితి సవితను స్తుతించను వరుణాది దేవతలు సవితను స్తుతింతురు మిత్రాదులు, సమాన ప్రీతిగల ఆర్యమ సవితను స్తుతింతురు

5 దాననిపుణులు, భక్తులగు యజమానులు పరస్పరము కలసి ద్యులోక భూలోక మిత్రుడగు సవితను సేవింతురు అహిర్బుధ్న మా స్తుతిని వినవలెను ముఖ్యధేనువులద్వారా వాగ్దేని మమ్ము పాలించవెలను

6 ప్రజారక్షక సవిత మా ప్రార్ధన మన్నించవలెను మాకు తన మనోహరధనము అందించవలెను ఓజస్వి స్తోతలు మారక్షణకు భగుని మరలమరల పిలుస్తారు అసమర్ధుడు రత్నములు అడుగును అనుగ్రహో అధయాతి రత్నమ్

7 వాజీగణము మితద్రవులు మిత్రమార్గులు శుభంకర అన్నవంతులు యజ్ఞసమయమున వారు మా స్తోత్రములు వినవలెను మాకు సుఖములు ప్రసాదించవలెను వాజీదేవగణా! దాత కాని వానిని హంతకులను, రాక్షసులను హతమార్చండి మాకున్న సకల పాతరోగములను దూరము చేయండి

8 వాజీగణమా ! మీరు మేధావులు అమరులు సత్యజ్ఞానులు ధననిమిత్తము జరుగు సకల యుద్ధములందు మీరు మమ్ము పాలించవలెను ఈ సోమమును పానము చేయుడు ఉన్మత్తులుకండి తృప్తులయి దేవయాన మార్గమున సాగండి

## ముప్పది తొమ్మిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-విశ్వేదేవతలు ఛందస్సు-త్రిష్టుప్

1 అగ్నిపైకి ఎగిసి స్తోతల శోభన స్తుతులను ఆశ్రయించవలెను అందరకు వార్ధక్యము కలిగించు ఉష పూర్వాభిముఖియై యజ్ఞమునకు రావలెను ఆదరయుక్తులగు యజమాని అతని భార్య రథికులవలె యజ్ఞమార్గమును ఆశ్రయిస్తారు మేమంపిన హోత యజ్ఞము చేయిస్తాడు

2 ఈ యజమానులు అన్నయుక్తులు కుశయుక్తులగుదురు వాయువు, పూష ప్రజాపాలకులు వడవలు గలవారు వారు ప్రజాహితులయి ఉషోదయముకన్న ముందటి ఆహ్వానమువిని, అంతరిక్షమునుండి రావలెను

3 ఈ యజ్ఞమున వసుగణములు భూమిమీద ఆనందించవలెను విశాల అంతరిక్షమునుండి, దీప్యమానులగు మరుద్గణములు పూజింపబడుదురు వేగగాములగు మరుత్తులు, వసువులారా ! మీ గమ్యము మావైపు కావలెను మా దూత మీ కొఱకు వెళ్లినాడు అతని ఆహ్వానము మన్నించండి

4 ప్రఖ్యాతులు, యజనీయులు, రక్షకులు విశ్వ దేవగణము యజ్ఞస్థానమునకు వస్తారు అగ్నీ! మా యజ్ఞమున మేము కోరిన దేవతలకు యజ్ఞము చేయుము భగునకు అశ్వినులకు ఇంద్రునకు వెంటనే పూజచేయుము

5 అగ్నీ ! ద్యులోకమునుండి స్తుతియోగ్యులగు మిత్ర, వరుణ, ఇంద్ర, ఆర్యమ, అదితి విష్ణువులను మా యజ్ఞముకు పిలువుము భూమి నుంచి కూడ పిలువుము సరస్వతి, మరుద్గణములు హృష్టులు కావలెను

6 మేము యజనీయులగు దేవతలకు, స్తుతులతోకూడ హవ్యము సమర్పింతుము అగ్ని మా అభిలాషలకు ఆటంకముగా కాకుండ మా యజ్ఞమును వ్యాప్తము చేయును దేవతలారా! గ్రహించదగి, అనుభవించదగిన ధనము ప్రసాదించండి నేడు మేము సహాయక దేవతలను కలుసుకొందుము

7 నేడు వశిష్ఠులు ద్యావాపృథ్వులను చక్కగా స్తుతించినారు యజ్ఞయుక్తలయి వరుణ, ఇంద్ర, అగ్నులను కూడ స్తుతించినారు ఆహ్లాదకారులగు దేవగణములు మాకు పూజనీయము, సర్వోత్తమమగు అన్నము అందించవలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## నలుబదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-విశ్వేదేవతలు ఛందస్సు-త్రిష్టుప్.

1. దేవతలారా ! మీరు మనసుతో ఆర్జించిన సుఖములు మా వద్దకు చేరవలెను మేము వేగవంతులగు దేవతలను స్తుతిస్తాము ఇప్పుడు సవిత పంపిన రత్నవంతమగు ధనమును మేము స్వీకరింతుము

2 మిత్రావరుణులు, ద్యావాపృథ్వులు మాకు అద్వేప్రసిద్ధమగు ధనము ఇవ్వవలెను ఇంద్రుడు, ఆర్యమ మాకు ప్రకాశవంతులగు స్తోతలు సేవించిన ధనము ఇవ్వవలెను వాయువు, భగుడు మాకు ఇవ్వతలపెట్టినట్టి ధనమునే అదితి మాకు అందించవలెను

3 పృషత్, అశ్వములుగల మరుత్తులారా ! మీరు రక్షించిన మానవుడు ఓజస్వి బలవంతుడు అగును అగ్ని సరస్వతి మున్నగు దేవగణములు యజమానిని వర్థిల్లచేయవలెను ఈ యజమాని ధనమునకు విఘాతుకులు ఉండరాదు

4 యజ్ఞప్రాపకుడగు వరుణుడు, మిత్రుడు అర్యమ అందరు శక్తియుతులు వీరందరు మా యజ్ఞకర్మను భరింతురు ఆటంకపరచరానిదియు, ప్రకాశమానయు అగు అదితి శోభన ఆహ్వానవంతురాలు మాకు బాధకలుగని రీతిగా సకల దేవతలు మమ్ము పాపములనుండి కాపాడవలెను

5 విష్ణువు హవ్యము ద్వారా ప్రాపణీయుడు అభీష్టవరదుడు దేవతలందరు విష్ణువు అంశపు వారే రుద్రుడు తన మహిమను మాకు ప్రదానము చేయవలెను అశ్వినులు హవ్యముగల గృహమునకు రావలెను

6 అందరి వరణీయ సరస్వతి దాన నిపుణలగు దేవపత్నులు మాకు ధనము ఇస్తారు దీప్తివంతపూషా ! ఆ ధనమును ఆటంక పరచకుము సుఖప్రదులు, గతిశీలురగు దేవగణములు మమ్ము చక్కగా పాలించవలెను సర్వత్ర సంచరించువాయువు మాకు జలము ప్రదానము చేయవలెను

7 నేడు వసిస్ఠులు ద్యావాపృథ్వులను చక్కగా స్తుతించినారు యజ్ఞయుక్తులగు వరుణ, ఇంద్ర, అగ్నులను కూడ స్తుతించినారు ఆహ్లాదకరులగు దేవగణములు మాకు పూజనీయము, సర్వోత్తమమగు అన్నము అందించవలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## నలుబది ఒకటవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-వేరువేరు ఛందస్సు-మొదటిది జగతి, తక్కినవి త్రిష్టుప్

1. మేము ప్రాతఃకాలమున ఇంద్రాగ్ని మిత్రావరుణులను ఆహ్వానింతుము ప్రాతఃకాలమున అశ్వినులను స్తుతింతుము ప్రాతఃకాలమున భగ, పూష, బ్రహ్మణస్పతి సోమ, రుద్రులను స్తుతింతుము

2 లోకములను భరించువారు, జయశీలురు, ఉగ్రులు, అదితి పుత్రులు వారిలో భగుని మేము ప్రాతఃకాలమున ఆహ్వానింతుము దరిద్ర స్తోతయు, ధనికుడగు రాజును భగదేవతను తమకు భోగభాగ్యములిమ్మని అర్థింతురు

3 భగుడా ! నీవు ఉత్తమనేతవు సత్యధమడవు మాకు మేము కోరినవి ఇమ్ము మా స్తోత్రము సఫలము చేయుము మమ్ము గోవులు, అశ్వముతో వర్థిల్ల చేయుము మేము పుత్రాదులతో మనుష్యవంతులము అగుదుము

4 మేము ఇప్పుడు మీవారము కావలెను దినపు మొదటి మధ్యన కూడా ..వారము కావలెను ధనికుడవగు భగదేవా ! సూర్యోదయమున మేము ఇంద్రాదుల అనుగ్రహము పొందవలెను

5 దేవతలారా ! భగుడే భగవానుడు ధనవంతుడు కావలెను మేము భగుని అనుగ్రహమున భగవంతులము ధనవంతులము కావలెను భగదేవా ! నిన్ను అందరు తేప తేపకు పిలుస్తారు నీవు ఈ యజ్ఞమున మాకు అగ్రగామివగుము

6. శుద్ధస్థానము కొఱకు దధిక్రవలె ఉషా దేవత మా యజ్ఞమునకు రావలెను వేగవంతమగు అశ్వరథమువలె ఉష, ధనదాత భగుని మాముందుకు తేవలెను

7 ఉష సకలగుణోపేత, ప్రవృద్ధ, పూజనీయ ఆమె గోవులు, వీరపురుషుల యుక్తముగను, జలసేచనము చేయుచును ఎల్లప్పుడు మాకు రాత్రివేళ చీకట్లను పార ద్రోలవలెను, *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## నలుబది రెండవ సూక్తము

### ఋషి-వశిష్ఠుడు, దేవత-విశ్వేదేవతలు ఛందస్సు-త్రిష్టుప్

1 స్తోతలగు అంగిరులు అంతట వ్యాపించవలెను పర్జన్యుడు మా స్తోత్రమును విశేషరూపమున అభిలషించివలెను హర్షద నదులు జలసేచనము చేయుచు సాగవలెను ఆదర సంపన్న పత్ని, యజమాని యజ్ఞరూపమున యజించవలెను

2 అగ్నీ! నీవు చిరకాలము నడిచిన మార్గము సుగమము కావలెను నల్లనివి, రాగిరంగు అశ్వములు యజ్ఞగృహమునకు నీ సమ వీరులను తెచ్చి శోభనందును ఆ అశ్వములనే నీ రథమునకు కట్టుము నేను యజ్ఞగృహమున కూర్చుండి దేతవలను ఆహ్వానింతును

3 దేవతలారా! నమస్కరించువారలగు స్తోతలు మీ యజ్ఞమును విధి పూర్వకముగా పూజింతురు మాకు దగ్గరలో ఉన్న హోతీ సర్వోత్తముడు యజమానులారా! దేవతల యజ్ఞమును చక్కగా నిర్వహించండి

బహుతేజోవంతులగు దేవతలారా! మీరు భూమిని ఆవర్తితముచేయండి

4 అగ్ని సకల జనులకు అతిథి అతడు వీరుడు, ధనవంతుడగువాని వాని గృహమున శయనించి కనిపించినప్పుడు గృహమందు నిలిచి ప్రసన్నుడైనపుడు అప్పుడు అగ్ని ఆ చుట్టుపట్ల జనులకు వరణీయ ధనము ఇచ్చును.

5 అగ్నీ! మా ఈ యజ్ఞమును స్వీకరింపుము ఇంద్ర మరుత్తుల ముందు మమ్ము యశస్వులను చేయుము రాత్రియు ఉషఃకాలమందును కుశలపై ఆసీనుడవగుము యజ్ఞాభిలాషులు మిత్రావరుణులను ఈ యజ్ఞమున పూజింపుము

6 ధనము కోటిన వసిష్ఠుడు ఈవిధముగనే బలపుత్రుడగు అగ్నిని బహురూపధన ప్రాప్తికని స్తుతించినాడు అగ్నిమాకు అన్నము, బలము, ధనము ఇవ్వవలెను *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

## వలుబది మూడవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-విశ్వదేవతలు ఛందస్సు-త్రిష్టుప్.

1 వృక్షశాఖలవలె మేధావుల స్తోత్రములు అన్నివైపుల వ్యాపించును వారే దేవకామి యజ్ఞమున నమస్కరించి నిన్నుపొందుటకు విశేషముగా స్తుతింతురు వారు ద్యావాపృథ్వులను కూడ నుతింతురు

2 వేగవంతమగు అశ్వమువలె ఈ యజ్ఞమునకు చేరుము ఘృతము స్రవించు స్రుక్కును ఎత్తుము యజ్ఞము కొఱకు మంచి కుశలను పరచుము

అగ్నీ ! నీ దేవకామి కిరణములు ఊర్ధ్వముఖులు కావలెను

3 గారాబముచేయబడు కొడుకు తల్లివడిలో కూర్చున్నట్లు దేవతలు యజ్ఞపు ఉన్నతాసనములందు విరాజిల్లవలెను

అగ్నీ ! నీ యజనీయ జ్వాలలు జుహువును చక్కగా కాపవలెను యుద్ధమున నీవు మా శత్రువును సాయము చేయరాదు

4 యజనీయ దేవగణములు పితుక దగిన జలధారలను కురిపించుచు, ఇష్టము వచ్చిన రూపమున మాసేవలను స్వీకరించవలెను దేవతలారా ! ధనములందు పూజ్యాధనము నేడు ఇచటకి రావలెను ఏక మనస్కులై మీరు విచ్చేయండి

5 అగ్నీ ! ఈవిధముగా ప్రజలనుంచి మాకుధనము ఇమ్ము నీవు మమ్ము విడువరాదు మేము నిత్యయుక్త ధనములతో మత్తులమై అహింసితులము కావలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## వలుబది నాలుగవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-దధిక్రుడు ఛందస్సు-మొదటిది జగతి తక్కినవి త్రిష్టుప్

1 నీ రక్షణ కొఱకు ముందు నేను దధిక్రదేవుని ఆహ్వానింతును తదుపరి అశ్వినులు, ఉష, సమిద్ధ అగ్ని, భగదేవతలను ఆహ్వానింతును ఇంద్ర, విష్ణు, పూష, బ్రహ్మణస్పతి, ఆదిత్యగణ, ద్యావాపృథ్వి, జల, సూర్యులను ఆహ్వానింతును

2 యజ్ఞప్రారంభమున మేము స్తోత్రముతో దధిక్రుని ప్రబోధితుని చేసి ప్రవర్తితుని చేయుదుము ఇళన స్థాపింతుము శోభన ఆహ్వాన సంపన్నులగు మేధావి అశ్వినులను ఆహ్వానింతుము

3 దధిక్రుని ప్రబోధితుని చేసిన నేను అగ్ని, ఉష, సూర్య, వాగ్దేవిని స్తుతింతును దురభిమానుల వినాశకారి వరుణుని మహాపింగళ వర్ణ అశ్వమును స్తుతింతును సకల దేవగణములు సకల పాపములను నానుండి వేరు చేయవలెను

4 అశ్వములందు ముఖ్యుడు, శీఘ్రగామి, గతిశీలుడగు దధిక్ర జ్ఞాతవ్యమును ఎరుగును ఉష, సూర్య, ఆదిత్యగణ, వసుగణ, అంగిరులతో కలిసి దధిక్ర స్వయముగా రథపు అగ్రభాగమున తగులును

5 దధిక్రా ! అందఱు యజ్ఞము చేయవలెను అందఱు చక్కని మార్గమున నడువవలెను అందఱకు దివ్యజలము లభించవలెను అందఱకు జ్ఞానము కలుగవలెను సామర్థ్యము కలుగవలెను అందఱు దేవతల గుణములు దానము చేయవలెను అందఱు స్వయముగా దేవతల వంటివారు కావలెను

## నలుబది ఐదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-సవిత ఛందస్సు-త్రిష్టుప్

1 సవిత రత్నయుక్తమగు తన తేజస్సుతో అంతరిక్షమును పూరించును అతడు అశ్వమును అధిరోహించును మానవులకు హితకరమగు అనంత ధనమునురెండు చేతులందు దాల్చును అతడు ప్రాణులను వారి స్థానములందు భరించి వారిని వారివారి కర్మలకు ప్రోత్సహించుచు విచ్చేయవలెను

2 దానము కొఱకు ప్రసరించిన విశాల హిరణ్మయ బాహువులతో సవిత అంతరిక్షపు అంచులవరకు వ్యాపించవలెను నేడు మేము సవితయొక్క ఆ మహిమనే కీర్తింతుము సూర్యుడు సహితము సవితకు కర్మ స్వేచ్ఛ నివ్వవలెను

3 తేజస్వి, ధనాధిపతి సవితయే మా కొఱకు ధనము పంపవలెను అతడు బహువిశాల రూపము ధరించును మాకు మానవభోగ యోగ్యమగు ధనము ఇవ్వవలెను

4 సవిత్ర స్తోత్ర రూపవచనుడు ఉత్తమ జిహ్వాజలవాడు సుందరహస్తములు కలవాడు ఆ సవితను మేము స్తుతింతుము అతడు మాకు విచిత్రము విశాలమగు అన్నము ప్రదానము చేయవలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## నలుపది ఆరవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-రుద్రుడు, ఛందస్సు-జగతి, చివరిది త్రిష్టుప్

1 రుద్రుడు దృఢ ధనుష్టుడు వేగవంతములను అమ్ములవాడు అన్నవంతుడు అజేయుడు విజేత సుతీక్ష్ణ అస్త్రి కర్త అటువంటి రుద్రుని స్తుతించండి అతడు వినవలెను

2 భూమిమీద, స్వర్గమందు ఉన్న వారిని ఐశ్వర్యమునుబట్టి తెలుసుకొనవచ్చును నిన్ను స్తుతించువారిని పాలింపుము మా ఇంటికి విచ్చేయుము మమ్ము రోగస్థులను చేయకుము

3 రుద్రా ! నీవు అతరిక్షమున పిడుగును విడుతువు అది నేలను అంటునపుడు మమ్ము తాకరాదు *"స్వనివాత"* రుద్రా ! నీ వద్ద వేల ఒషధులు ఉన్నవి మా పుత్ర, పౌత్రులను హింసించకుము

4 రుద్రా ! నీవు మమ్ము కొట్టరాదు మమ్ము విడువరాదు నీ కోపమున పడిన ఉచ్చులలో మమ్ము పడనీయకుము ప్రాణులచే ప్రశంసించబడు యజ్ఞమున మమ్ము భాగస్వాములను చేయుము *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## నలుపది ఏడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అప్, ఛందస్సు-త్రిష్టుప్.

1 అప్ దేవతా ! నీవు సంస్కరించిన సోమరసము దేవతలు ఇష్టపడునది అధ్వర్యులు ఇంద్రునకు పానయోగ్యముగా చేసినది అట్టి శుద్ధము, నిష్పాపము, వృష్టిజలసేచనకారి అగు రసవంత సోమరసమును మేముకూడ సేవింతుము

2 శీఘ్రగతిగల అపాంనిపాత, అగ్నీ ! దేవతలు నీ రసవత్తమ సోమమును రక్షించవలెను అందు వసువులు రుద్రులు ఉన్మత్తులు అగుదురు మేము దేవాభిలాషులము నేడు ఆ సోమరసమును అందుకొందుము

3 అప్ దేవత జలదేవత అనేక పావన రూపములవాడు హర్షోత్పాదకుడు ప్రకాశమానుడు దేవతల స్థానములందు ప్రవేశము కలవాడు అతడు ఇంద్రుని యజ్ఞాది కర్మములకు ఆటంకము కలిగించదు అధ్వర్యాలారా ! మీరు సింధు మున్నగు జలస్థానమునలకు ఘృతయుక్త హవ్యముతో హోమము చేయండి

4 సూర్యుడు తన కిరణములతో జలములను విస్తరింపచేయును ఇంద్రుడు జలగమన మార్గమును ఏర్పరచినాడు సింధుగణములారా ! మీరు మా కొఱకు ధనము దాల్చుడు *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## నలుపది ఏనిమిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఋభువులు, ఛందస్సు-త్రిష్టుప్

1 ఋభువులారా ! మీరు నేతలు, ధనవంతులు మా సోమము పానము చేయుడు మత్తులగుడు మీరు వెళ్లుచున్నారు మా అశ్వములు మీ కార్యములు నిర్వర్తించునవి సమర్థలు అవి మా కొఱకని మానవహితకర రథమును ఆవర్తితము చేయవలెను

2 ఋభువులారా ! మేము మీ వలన ప్రసిద్ధులము అగుదుము మేము సమర్థులము కావలెను మీ సాయమున మీబలముతో మేము శత్రువులను అణచివేసెదము వాజనామక ఋభువు యుద్ధములందు మమ్ము రక్షించవలెను ఇంద్రుని సహాయమున మేము వృత్రుని బారినుండి తప్పించుకొన గలము

3 ఇంద్రుడు ఋభుగణములు తమ ఆయుధములతో మా శత్రుసేనలను అనేకములను ఓడింతురు యుద్ధము జరిగినప్పుడువారు సమస్త శత్రువులను హతమార్చెదరు విభ్వ, ఋభుక్ష, వాజలను ముగ్గురు ఋభువులను, ఆర్య ఇంద్రుడు మథించి శత్రుబలములను నష్టపర్చెదరు

4 ప్రకాశక ఋభువులారా ! మాకు నేడు ధనము ఇవ్వండి

సమస్త ఋభువులురా ! ప్రసన్నులై మీరు మమ్ము రక్షించండి

ప్రశస్త ఋభువులారా ! మీరు మాకు అన్నము ప్రదానము చేయండి. *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

## నలుబది తొమ్మిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అప్, ఛందస్సు-త్రిష్టుప్.

1 జలములందు సముద్రుడు జ్యేష్ఠుడు అప్ దేవత గమనశీలుడు శోధకుడు అతడు అంతరిక్ష మధ్యమునుండి సాగును వజ్రధరుడు, అభీష్ట వర్షియగు ఇంద్రుడు జలములను విడిచినాడు ఆ అప్‌దేవత ఇక్కడ మమ్ము రక్షించవలెను

2 అంతరిక్షమున పుట్టిన జలములు నదులలో ప్రవహించు జలములు నేల అడుగునుండి త్రవ్వితీసిన జలము స్వయముగా పుట్టి సముద్రమువైపు సాగుజలములు అట్టిదీప్తములగు పవిత్ర జలములన్నియు మమ్ము రక్షించవలెను

3 జలసమూహముల స్వామి వరుణుడు అతడు సత్యాసత్యములకు సాక్షీభూతుడై మధ్యలోకమునకు తరులును అట్టి రసమును వర్షించు ప్రకాశయుక్తములగు, శోధక జలదేవతలు మమ్ము రక్షించవలెను

4 రాజావరుణుడు నివసించునదియు, సోమము నిలుచునదియు అన్నములుపొంది విశ్వదేవతలు ప్రసన్నులగునదియు, వైశ్వానరుడు ఆసీనమగునదియు ప్రకాశకఅప్ దేవత మమ్ము రక్షించవలెను

## ఏబదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-వేరువేరు, ఛందస్సు-జగతి.

1 మిత్రావరుణులారా ! ఈ లోకమున మీరు మమ్ము రక్షింపుడు నిలిచి ఉండునదియు పాకునదియు అగు విషము మమ్ము చేరరాదు అజక అను వ్యాధివలె దుర్దర్శన విషము నశించి పోవలెను కనిపించక సాగు సర్పము మా పదధ్వనులను గుర్తించరాదు *"మాం పద్యే నిరపవరసా విదత్సరుః"*

2 వందననామక విషము నానాజన్మములందు వృక్షాది గ్రంథిస్థానములందు ఉత్పన్నమగును జాను గుల్మాదులకు వాపు కలిగించు విషమును దీప్తిమాన్ అగ్నిదేవా ! మా మానవులకు దూరముగా ఉంచుము *"మాం పద్యే నరపసా విదత్సరుః"*

3 వక్షఃస్థానమున (రొమ్మున) ఉండు విషమును నదుల జలములందు ఓషధులతో కలుగు విషమును విశ్వదేవగణములారా ! మా నుండి దూరము చేయండి *"మూం పద్యేనరపసా విదత్సరుః"*
4 ప్రబల దేశమునకు పోవు నదులు దిగువదేశమునకు పోవు నదులు ఉన్నత దేశమునకు పోవు నదులు జలయుక్తములు, జలశూన్యములై లోకమును తృప్తిచెందించు నదులు మాకు వచ్చు *"శిపాద"* రోగమును నయము చేయవలెను మాకు శుభములు కలిగించవలెను నదులు బాధించరాదు.

## ఏబది ఒకటవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఆదిత్యుడు, ఛందస్సు-త్రిష్టుప్.

1 ఆదిత్యుల రక్షణలతో మాకు నూతనము సుఖకరమగు గృహము లభించవలెను క్షిప్రకారి ఆదిత్యగణములు మాస్తోత్రములు వినవలెను ఈ యజ్ఞకర్తను నిరపరాధిని అవిరుద్ధుని చేయవలెను
2 ఆదిత్యగణము అదితి అత్యంత సరళ స్వభావ మిత్ర, వరుణ, అర్యమ ఉన్మత్తులు కావలెను లోక రక్షక దేవగణములు మమ్మురక్షించవలెను వారు మమ్ము రక్షించుటకు సోమపానము చేయవలెను
3 మేము సమస్త ఆదిత్య గణములను సమస్త మరుద్గణములను సమస్త దేవగణములను సమస్త ఋభువులను ఇంద్రుని, అగ్నిని, అశ్వినులను స్తుతించుచున్నాము *"యూయంపాత స్వస్తిభిః సదానః"*
(ఆదిత్యులు 12మంది మరుత్తులు 49మంది దేవగణము 3333 ఋభువులు ముగ్గురు)

## ఏబది రెండవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఆదిత్యులు, ఛందస్సు-త్రిష్టుప్

1 మేము ఆదిత్యులకు ఆత్మీయులము అవిభాజ్యులము వసువులారా ! మానవులను రక్షించండి మిత్రావరుణులను భజించుచు మేము ధనములు అనుభవింతుము ద్యావాపృథ్వులారా మేము శక్తివంతులముకావలెను

2 మిత్రావరుణాది ఆదిత్యగణములు మా పుత్ర పౌత్రాదులకు సుఖములు కలిగించవలెను ఇతరుల పాపము మేము అనుభవించకుండవలెను వసువులారా ! ఏ కర్మము చేయుట వలన మీరు నాశము చేసెదరో అట్టి కర్మను మేము చేయకుండవలెను

3 క్షిప్రకారులగు అంగిరులు సవితను యాచించి అతని ధనమును పొందినారు వ్యాపింపచేసినారు యజ్ఞశీలుడు, మహాపిత, ప్రజాపతి మఱియు దేవగణములు సుమనస్కులై ఆ ధనమును మాకు అందించవలెను

## ఏబది మూడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ద్యావాపృథ్వులు, ఛందస్సు-త్రిష్టుప్.

1 ద్యావాపృథ్వులు విశాలలు దేవతలకు జననులు స్తోతలు వారిని స్తుతులతో స్తుతించుచు స్థాపించినారు అట్టి యజనీయులు మహిమాన్వితలగు ద్యావాపృథ్వులను ఋత్విక్కుల బాధాసహితుడనై యజ్ఞమున నమస్కారములతో స్తుతింతును

2 స్తోతలారా ! కొత్త స్తుతులు రచించండి మాతా పితృరూపులయిన ద్యావాపృథ్వులను యజ్ఞమునందు అగ్రభాగమున స్థాపించండి ద్యావాపృథ్వులు తమ వద్దగల వరణీయ ధనము మాకు ఇచ్చుటకు దేవతల సహితులై మా వద్దకు రావలెను

3 వాస్తోష్పతీ ! మేము నీ యొక్క సుఖకరము రమణీయము ధనవంత స్థానమును పొందవలెను నీవు మాకు లభించనిది లభించిన ధనములను రక్షింపుము *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## ఏబది నాల్గవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-వాస్తోష్పతి, ఛందస్సు-వివిధములు.

1 వాస్తోష్పతీ ! నీవు రోగ నాశకుడవు సర్వ ప్రకార రూపముల ప్రతిష్ఠుడవయి మాకు మిత్రుడవు, సుఖకరుడవగుము

2 శ్వేతవర్ణము ఒక్కొక్క అంశమున పింగళ వర్ణ సరమ వంశోద్భవుడే వాస్తోష్పతి అతడు దంతములు వెళ్లపెట్టినపుడు తినునపుడును, పెదవి కదలినపుడును అవి ఆదంతములు ఆయుధమువలవలె శోభిల్లును ఇప్పుడు మాత్రము నీవు సుఖముగా నిద్రింపుము *"షుస్వప"*

3 సారమేయా ! నీవు బయలుదేరిన చోటికే తిరిగి చేరుదువు *"పునఃసరః సారమేయః"* నీవు దొంగలు బందిపోటుల దగ్గరికి వెళ్లుము ఇంద్రుని స్తుతించువాని వద్దకేగి ఏమిచేతువు? మమ్ము ఎందుకు బాధింతువు సుఖముగా నిద్రింపుము *"షుస్వప"*

4 నీవు పందిని చీల్చుము పంది నిన్ను చీల్చును ఇంద్రుని స్తుతించువాని దగ్గరకేగి ఏమిచేతువు? మమ్ము ఎందుకు బాధింతువు? సుఖముగా నిద్రింపుము *"షుస్వప"*

5 నీ తండ్రి నింద్రించవలెను తల్లినిద్రించవలెను నీవు నిద్రించవలెను గృహస్వామి నిద్రించవలెను బంధువులు నిద్రించవలెను నలువైపుల జనులు నిద్రించవలెను

6 ఇచట ఉన్నవాని సంచరించువాని మమ్ము చూచువాని కనులు పొడిచివేయుదుము ఈ మేడ ఎంత నిశ్చలముగా ఉన్నదో వారును అట్లే అయిపోవుదురు

7 వేయి కిరణముల వృషభము సూర్యుడు సముద్రము నుండి లేచువాడు ఆ విజేత సాయమున సకల మానవులను పండపెట్టెదము నిద్రింప చేయుదుము *"స్వాపయామసి"*

8 అంగణమున పడుకున్న అంగనలు వాహనములపై పండినవారు, పరువులపై పన్నవారు, పుణ్యగంధులు అట్టి అంగనలందరిని నిద్రింప చేయుదుము

(వశిష్ఠుడు ఒకరాత్రి వరుణుని ఇంటి ప్రవేశించినాడు అక్కడి కుక్క మొరుగుచు వశిష్ఠుని వెంబండించినది ఈ మంత్రములతో దానిని శాంతింపచేసి నిద్రపుచ్చినాడు )

## మరొక కథనము

1 వశిష్ఠునకు మూడు రాత్రులు అన్నముదొరకలేదు నాలుగవ రాత్రి వరుణుని ఇంటికి చేరదలచినాడు. ద్వారము వద్ద కుక్క బెదిరించినది దానిని నిద్ర పుచ్చినాడని శాయణుడు

**(ఆంధ్ర వచన ఋగ్వేద సంహిత ఏడవ మండలము ఐదవ అష్టకమున మూడవ అనువాకము సమాప్తము )**

## నాలుగవ అనువాకము ఏబది ఆరవ సూక్తము

**ఋషి-వసిష్టుడు, దేవత-మరుత్తులు ఛందస్సు 1-11 ద్విపద, 12-20 విరాజ, మిగిలినవి త్రిష్టుప్**

1 కాంతిమంతనేతలు, సమాన గృహనివాసులు, మహాదేవపుత్రులు, మానవహితైషులు, అశ్వవంతులు ఎవరు? వీరెవరు?

2 వీరి పుట్టుక ఎరిగినవారులేరు వీరిలో వీరికే తమ జన్మకథ తెలియును

3 స్వయం చాలకులు పరస్పరము కలిసికొనువారు వాయువేగముగల శ్యేనముతో స్పర్థింతురు

4 శాస్త్రిము లెరిగిన మనుజులు ఈ శ్వేతవర్ణ జీవులను ఎరుగుదురు మహతి పృశ్ని వీరిని అంతరిక్షమున మోసినది

5 ఆమె బుద్ధిజీవులగు మరుత్తుల అనుగ్రహమున సదాశత్రువులను ఓడించునదియు, ధనమునకు పుష్టిని ఇచ్చునదియు వీరపుత్రవతియు అయినది

6 మరుత్తులు తాము వెళ్లు స్థలములకు అందరికన్న ఎక్కువగా వెళ్లుదురు అలంకారములతో అందరికన్న ఎక్కువ శోభింతురు వారు కాంతిపూర్ణులు ఓజస్వులు

7 మీ తేజస్సు ఉగ్రము బలము స్థిరము మరుద్గణములు బుద్ధిమంతులు కావలెను.

8 మీ బలము సర్వత్ర శోభిల్లునది మా చిత్తము క్రోధశీలము పరాభవించగల మీవేగము స్తోతవలె బహువిధ ధ్వనికలది

9 మరుత్తులారా ! మీ పురాతన అస్త్రములు మాకు దూరము కానీయండి మీ క్రూర ప్రవృత్తి మమ్ము తాకరాదు

10 మీరు క్షిప్రకారులు మిమ్ము మీకు ప్రియములగు నామములతో పిలుతుము మీరు అందుకు సంతుష్టులగుదురు

11 మరుద్గణములు సుందర ఆయుధధారులు గతిశీలురు సుందర అలంకారములవారు వారు మా దేహములను అలంకరింతురు

12 మరుత్తులారా ! మీరు శుచిమంతులు శుచిమంత హవ్యము మీది కావలెను మీరు శుచిమంతులు మీ కొఱకు మేము శుచిగల యజ్ఞము చేతుము జలస్పర్శ మరుద్గణము ఋతమునుండి సత్యమును పొందినారు మరుద్గణములు శుచిమంతులు, వారి జన్మము శుచిమంతము వారు ఇతరులను శుచిమంతులను చేయుదురు

13 మరుత్తులారా ! మీ దండములకు కడియములు ఉన్నవి మీ ఉదరమున ఉత్తమ హారములున్నవి వర్షముతో మెరుపుతో శోభించినట్లు జలమును ఇచ్చునపుడు మీరు ఆయుధములతో శోభిల్లుదురు

14 మరుత్తులారా ! అంతరిక్షమున ఆవిర్భవించిన మీ తేజస్సు విశేషరూపమున గమనము చేయును మీరు విశేష రూపమున యజనీయులు జలములను వర్ధిల్లచేయండి మీరు సహస్ర సంఖ్యాకము, గృహోత్పన్నము, గృహమేధి సమర్పించు ఈ భాగములను ఆశ్రయించండి

15 మరుత్తులారా ! అన్నవంతుడగు మేధావియొక్క హవ్యయుక్తి స్తోత్రమును మీరు ఎరుంగుదురు శోభన పుత్రవంతునకు వెంటనే ధనము నివ్వండి ఆ ధనమును శత్రువులు నష్టపరచరాదు

16 మరుద్గణములు నిరంతరము నడచు అశ్వమువంటి చక్కని నడకలవారు ఉత్సవమును చూచుజనులవంటివి శోభస్కరులు ఇంట ఉన్న పసిపాపవంటి సుందరులు ఆటలలో ఉన్న పిల్లవంటివారు వారు జలములను దాల్తురు

17 మరుత్తులారా ! మాకు ధనము ఇవ్వండి మీ మహిమ సుందరము ద్యావాపృధ్వులను పూరించండి మాకు సుఖములు ప్రసాదించండి మీ మానవ నాశక ఆయుధము మా నుంచి దూరముగ ఉంచండి సుఖములు అందుకొని మాముందు అవతరించండి

18 మరుత్తులారా ! తన గృహమున కూర్చున్న హోత మీ దానకార్యములను ప్రశంసించును మిమ్ము మాటిమాటికి ఆహ్వానించును కార్యనిష్ఠగల యజమానిని కాపాడు హోత కపటశూన్యుడై మిమ్ము స్తోత్రములతో స్తుతించును

19 ఈ మరుత్తులు యజ్ఞమున క్షిప్రకారి యజమానిని ప్రసన్నుని చేయుదురు వీరు తమ బలమున బలవంతులను క్రుంగదీయుదురు వంగపెట్టుదురు అర్గురు స్తోతలను హింసకులనుండి రక్షింతురు కాని హవ్యము అందించని వారికి గొప్ప హానికిలిగింతురు

20 వీరు ధనికులను, దరిద్రులను ఉభయులను ఉత్తేజ పరతురు దేవతలు, బంధువులు కోరినరీతి మీరు చీకట్లను దూరము చేయండి మాకు మేము కోరినట్టి పుత్రపౌత్రులను ప్రసాదించండి

21 కోఱికలు నీడేర్చు మరుత్తులారా ! మేము మీ దానములకు ఆవల ఉండరాదు మీరు ధనమును దానము చేయునపుడు మమ్ము వెనుక పడనీయరాదు అభిలషణీయ ధనములందు మమ్ము భాగస్వాములను చేయవలెను మీ ధనము మంచి జన్మగలది దానిలో కూడ మమ్ము భాగస్వాములను చేయవలెను

22 పరాక్రమశాలురు ఓషధులను జనులను జయించుటకు కుపితులైనప్పుడు అప్పుడు రుద్రపుత్ర మరుత్తులు యుద్ధమునందు శత్రువుముందు మాకు రక్షకులు కావలెను

23 మరుత్తులారా ! మా పూర్వీకులు కొఱకు మీరు అనేక కార్యములు చేసినారు అతడు ముందటి ప్రశంసనీయ కార్యములను కూడ మీరే చేసినారు యుద్ధమున మీ సహాయము వీరుడైనవాడు శత్రువును పరాజితును చేయును మీ సాయమునననేస్తోత అన్నము అనుభవించుచున్నాడు

24 మరుత్తులారా ! మా పుత్రుడు బలశాలి కావలెను అతడు అసుర శత్రువులను వధించవలెను ఆ పుత్రుని కూడి అందమగు నివాసమునకుగాను శత్రువును నాశనము చేయుదుము మీ ఆత్మీయస్థానమున మేము నివసింతుము *"స్వమోకో అభివఃస్యామ"*

25 ఇంద్ర, వరుణ, మిత్ర, అగ్ని, జల, ఓషధి, వృక్షములు మాస్తోత్రమును ఆశ్రయించవలెను మరుత్తుల వడిలో మేము సుఖించవలెను

*"శర్మం న్త్స్యామ మరుతాముపస్థేయూయం పరాతస్వస్తిభిః సదానః"*

## ఏబది ఏడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-మరుత్తులు, ఛందస్సు-త్రిష్టుప్.

1 యజనీయ మరుత్తులారా యజ్ఞకాలమున స్తోతలు ఉన్మత్తులగుదురు అప్పుడు మీ బలముతో పాటు మీ నామమును కీర్తింతురు వారు విశాల ద్యావాపృథ్వులను గడగడలాడింతురు మేఘములనుండి జలము వర్షింతురు ఓజస్సులై సర్వత్ర సంచరింతురు

2 మరుద్గణములు స్తోతలకొఱకు వెదుకుదురు వారు యజమాని మనోరథము పూరింతురు మరుద్గణములారా ! మీరు ప్రసన్నులుకండు సోమపానమునకు మా యజ్ఞమునకు విచ్చేయుడు కుశలపై ఆసీనులుకండు

3 మరుద్గణములు చేసినంత దానము మరెవ్వడు చేయజాలరు వారు హారములు, ఆయుధములతో తమ దేహములను అలంకరించు కొందురు ద్యావాపృథ్వులు వెలిగించు వెలుగులుగల గాలిదేవరలు అందమునకుగాను సమాన రూప ఆభరణములను వ్యక్తపరతురు

4 మరుత్తులారా ! ప్రసిద్ధముగా మీ ఆయుధము మాకు దూరముగా ఉండవలెను మేము మానవులము మా విషయమున అపరాధము చేయగలవారలము అయినను మీ ఆయుధము మామీద పడరాదు

5 మా యజ్ఞమున మర్త్తులు రమింతురుగాత *"కృతోచిదత్రమరుతః"* అనువారు ఆనందమయులు దీప్తివంతులు శుభంకరులు మరుత్తులారా ! మీరు దయతలచండి లేదా మా స్తుతులకు ప్రసన్నులకండు మమ్ము తగురీతిన పాలించండి అన్నమూలమున పోషించండి మమ్ము అభివృద్ధిపరచండి

6 మరుద్గణములారా ! మీరు స్తుతులయి హవిని ఆరగించండి మీరు నేతలు సకల జలసహితులై విరాజిల్లినారు మా సంతానమునకు జలము అందించండి హవ్యదాతకు సత్యము ప్రియమగు ధనము ఇవ్వండి *"జిగృత రాయః సూనృతా మఘాని"*

7 మరుద్గణములు స్తుతులయి, సకల రక్షణ సహితులై, యజ్ఞమున స్తోతముందు అవతరించవలెను వారు స్వయముగా స్తోతలను పుత్ర, మిత్ర, పరిచారణాదులతో శత సంఖ్యాకులను చేయుదురు *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## ఏబది ఎనిమిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-మరుత్తులు, ఛందస్సు-త్రిష్టుప్.

1 స్తోతలరా ! వర్షము నిచ్చు మరుద్గణములను సర్వదా పూజించండి వారు స్వర్గమునందు అందరిని మించినబుద్ధికుశలురు తమ మహిమతో వారు ద్యావాపృథ్వులను భగ్నము చేయుదురు భూమి, అంతరిక్షమునుండి స్వర్గమును వ్యాపించ చేయుదురు

2 మరుత్తులారా ! మీరు భయంకరులు ప్రవృద్ధ బుద్ధులు. గమనశీలురు మీకు దీప్తుడగు రుద్రుడు

జన్మనిచ్చినాడు మీరు తేజము, బలమును ప్రభావ శాలురయినారు మీ గమనమునకు సూర్యుని చూడగల సమస్తప్రాణిజాలము భయపడును

3 మరుత్తులారా ! మీరు హవ్యయుక్తునకు చాల అన్నము ఇవ్వండి అందములగు మా స్తోత్రములను స్వీకరించండి మీరు పయనించిన మార్గమున ప్రాణిజాలమునకు హానికలుగదు మీరు మమ్ము అభిలషణీయ రక్షణలతో పెంపొందించండి

4 మరుత్తులారా ! మీరు రక్షించిన స్తోత శత సంఖ్యాక ధనవంతుడగును మీరు రక్షించిన స్తోత ఆక్రమణకారి శత్రువును అణచి సహస్ర ధనవంతుడగును మీరు రక్షించినవాడు సామ్రాట్టు శత్రునాశకుడగును మీరు ఇచ్చిన ధనము మరింత పెరగవలెను

5 కోటికలు తీర్చుమరుత్తులను నేను సేవింతును వారు మరల మరల ఎన్నోమార్లు మాముందుకు రావలెను ఏ ప్రకటిత, అప్రకటిత పాపమున మరుద్గణములకు కోపము కలుగునో, అట్టి పాపములను మరుత్తులను స్తుతించి కడిగి వేతుము

6 ధనవంతులగు మరుత్తుల శోభన స్తుతిని ఈ సూక్తమున చేసినాము మరుద్గణములు ఈ సూక్తమును స్వీకరించవలెను అభీష్ట వర్షక మరుత్తులు దూరమునుండియే శత్రువును వేరు చేయవలెను *"యూయంపాత స్వస్తిభిః సదా నః"*

## ఏబది తొమ్మిదవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-రుద్ర-మరుత్తులు, ఛందస్సు- 1-6బృహతి, 7,8 త్రిష్టుప్, 11 గాయత్రి, 12 అనుష్టుప్

1 దేవతలారా ! స్తోతలను భయమునుండి రక్షించండి అగ్ని, వరుణ, మిత్ర, అర్యమ, మరుత్తులారా ! మీరు సన్మార్గము నడిపించిన వానికి సుఖముల నివ్వండి

2 దేవతలారా ! మీ రక్షణలో మీకు ప్రియదినమున యజ్ఞము చేయువాడును శత్రువును ఆక్రమించువాడును మిమ్ము అన్యస్థానములకు పోనీక హవ్యము ఇచ్చువాడును తన నివాసమును పెంచుకొనును

3 నేను వసిష్ఠుడను మీలో మందులను వదిలి స్తుతించను అందరిని స్తుతింతును మరుత్తులారా! మీరు సోమాభిలాషులై, అందరు కలిసి మా సోమము అభిషుతముకాగా సోమపానము చేయండి

4 నేతలారా ! మీరు, కోటిన కోర్కెలు తీర్చినవారిని మీ రక్షణలు యుద్ధమున కాపాడును మీ అనుగ్రహ వృద్ధులు నవీనములై మా వద్దకు ఏతెంచవలెను సోమపానాభిలాషులారా ! మీరు

త్వరగారండి

5 మరుత్తులారా ! మీ ధనములు పరస్పరము కలిసి ఉన్నవి సోమరూప హవి భక్షణకుగాను చక్కగా విచ్చేయుడు మీకు నేను హవి అందించుచున్నాము మీరు వేరు చోటునకు వెళ్లవద్దు

6 మరుత్తులారా ! మీరు మా కుశలపై ఆసీనులు కండు కోరిన ధనములు ఇచ్చుటకు మావద్దకు విచ్చేయుడు మీరు బాధించనివారై ఈ యజ్ఞమున మదకరసోమ రూప హవ్యమునుస్వాహా అని ఉన్మత్తులగుడు

7 అంతర్హిత మరుత్తులారా ! మీ అవయవములను అలంకరించుకొని నీలవర్ణ హంసలవలె విచ్చేయండి నా యజ్ఞమున ఆనందించి, సంతసించిన మానవులవలె విశ్వవ్యాప్త మరుద్గణములు నాచుట్టు చేరవలెను

8 ప్రశంసనీయ మరుత్తులారా ! వికార క్రోధమున తిరస్కృతులైన మానవుడు మా మనసును నాశముచేయగోరును వాడు పాపి-ద్రోహి వరుణదేవు పాశములతో మమ్ము బంధించతలచినాడు వాడిని మీరు అత్యంత తాపకరమగు ఆయుధములతో నష్టపరచండి

9 శత్రుతాపకులారా ! ఇదే మీ హవ్యము మీరు శత్రుభక్షకులు మీ రక్షణలతో హవిని స్వీకరించండి

10 మరుత్తులారా ! మీరు గృహమునందును శుభప్రదాతలగుదురు రక్షణలతో విచ్చేయండి వెళ్లవద్దు

11 మరుత్తులారా ! మీరు స్వయం ప్రవృత్తులు క్రాంతదర్శులు నేను యజ్ఞమును గురించి ఆలోచించుచున్నాను

12 *త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।*
*ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్ ॥*

మేము సుగంధియు, పుష్టివర్ధకుడగు త్ర్యంబకుని పూజింతుము ఉర్వాక ఫలమువలె మృత్యుబంధనము నుండి విడిపించుము అమృతము నుండి విడిపించకుము

*(సుగంధి ప్రసారితమగు పుణ్యకీర్తి పుష్టివర్ధనమ్ జగములకు బీజప్రాయము లేదా అణిమాది శక్తి వర్ధనము త్ర్యంబకమ్ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఆదిస్థానము ఉర్వాకమ్ బదరీ ఫలము)*

*(ఆంధ్ర వచన ఋగ్వేద సంహిత ఏడవ మండలము ఐదవ అష్టకమున నాల్గవ అధ్యాయము సమాప్తము)*

ఓం నతామినన్తిమాయినో నధీరావ్రతా దేవానాం ప్రథమాద్రవాణి.
నరోదసీ అద్రుహా వేద్యాభిర్నపర్వతావి నమేత స్థివాంసః

అయిదవ అధ్యాయము అరువదవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దైవత-మైత్రావరుణులు ఛందస్సు-త్రిష్టుప్.

ఓం యదద్య సూర్యబ్రవో నాగా ఉద్యన్మిత్రాయవరుణాయ సత్యం
వయందేవత్రాఽది తేస్యామ తవ ప్రియాసో ఆర్యవన్గృణాంతః

1 సూర్యా ! ఉదయించుము నేడు అనుష్ఠాన కాలమున మమ్ము పాపరహితులను చేయుము అదితీ! దీనుడు కానట్టి నీవు మా దేవతలలలో మిత్రావరుణులవద్ద సత్యమ వగుము అర్యమన్! దాతా నిన్ను స్తుతించి మేము నీకు ప్రీతిపాత్రులము అగుదుము

2 మిత్రావరుణులారా ! ఇతడు మానవ దర్శనీయుడు సూర్యుడు అతడు అంతరిక్షమున సాగును ద్యావాపృధ్వుల కొఱకు ఉదయించును అతడు సమస్త స్థావర జంగమాత్మక జగములకు పోషకుడు మానవుల పుణ్యాపాపములను వీక్షించును

3 మిత్రావరుణులారా! సూర్యుడు అంతరిక్షమున ఏడు హరితవర్ణ అశ్వములను తన రథమున కట్టినాడు ఆ ఏడు జలదాతలయి సూర్యుని తీసికొని సాగును గోపాలుడు గోసమూహములను కాపాడినట్లు సూర్యుడు ఉదయించి లోకమునందలి ప్రదేశములను ప్రాణులను కాపాడును

4 మిత్రావరుణులారా! మీ కొఱకు అన్నము, మధుర పురోడాశము ఉన్నవి సూర్యుడు దీప్తమగు అంతరిక్షమునకు ఎక్కును సమాన ప్రీతిగల మిత్ర, ఆర్యమ, వరుణాదులు సూర్యునకు మార్గము కలిగింతురు

5 మిత్రావరుణులు ఆర్యమ పాపనాశకులు వారు అహింసక, సుఖకర అదితికి పుత్రులు వారు యజ్ఞ గృహమున పెంపొందుదురు

6 ఆదిత్యుడు మిత్రుడు, వరుణుడు ఈ ముప్పనిరిని లొంగదీయగల ాడు లేదు వారు అజ్ఞానులను జ్ఞానవంతులను చేయుదురు వారు ఉత్తమ జ్ఞానవంతుల కర్మానుష్ఠానవంతులవద్దకు వెళ్లి వారి దుష్కృతములను తుడిచివేసి మమ్ము మంచి దారిన తీసికొని వెళ్లుదురు

7 వీరు అనిమిషులై ద్యులోక భూలోకములందలి అజ్ఞానులను కర్మపరులను చేయుదురు సామర్థ్యమున దిగువ దేశములందు సహితము నదుల జలము లభించును వారు మమ్ము వ్యాపక కర్మమును దాటించవలెను

8 ఆర్యమ, మిత్రావరుణులు రక్షణలు కలిగించిన హవ్యదాలకు సుఖములు కలిగింతురు హవ్యదాత పుత్రపౌత్రులకు సహితము సుఖములు కలిగింతురు మేము శీఘ్రకారి దేవతలకు కోపము కలిగించు పనులు చేయకుండవలెను

9 మా యజ్ఞవేదిమీద మమ్ము ద్వేషించువారు దేవతలను స్తుతించనివారు ఉందురు వరుణుడు వారిని నష్టపరచవలెను ఆర్యమ మమ్ము రాక్షసాదులనుంచి వేరుచేయవలెను కోటికలు తీర్చు మిత్రావరుణులు హవ్యదాతనగు నాకు విశాల ప్రదేశము నివ్వవలెను

10 ఈ మిత్రాదుల స్నేహము గుప్తము, దీప్తము వీరు గుప్తబలమున మమ్ము ద్వేషించువారిని ఓడింతురు మిత్రాది దేవతలారా ! మీ భయమున మా విరోధులు గడగడలాడుదురు మీ బలమహిమతో మమ్ము సుఖవంతులను చేయండి

11 అన్నము ఉత్తమ ధనము దానము చేయునట్టి యజమాని మిమ్ము స్తుతించు స్తోత్రములకు తన బుద్ధిని జోడించినపుడు మఘవాదులు ఆ స్తోత స్తుతులను ఆశ్రయిస్తారు అట్టివాని కొరకు సుందరగృహము ఏర్పరుస్తారు

12 మిత్రావరుణులారా! మీ ఉభయుల యజ్ఞమున ఈ స్తుతి ఉచ్చరించబడినది దీనిని స్వీకరించండి త్వరత్వరగా మా విపత్తులను దూరము చేయండి మమ్ము దరికి చేర్చండి

## అరువది ఒకటవ సూక్తము

### ఋషి-వశిష్ఠుడు, దైవత-మిత్రావరుణులు ఛందస్సు-త్రిష్టుప్

1 మిత్రావరుణులారా ! మీరు ప్రకాశవంతులు సూర్యుడు మీ నేత్ర స్వరూపుడు శోభన రూపములవాడు అతడు తన వెలుగులు పెంచుచు ఆకసమున ఎగబాకును సూర్యుడు సమస్త భువనములను వీక్షించును అతడు మానవులందుఉండు స్తోత్రములను తెలియును

2 వశిష్ఠుడు యాజ్ఞికుడు విప్రుడు చిరశ్రోత మిత్రావరుణులారా ! అట్టి వసిష్ఠుడు మీ కొఱకు పూజనీయ స్తుతులు రచించినాడు మీరు శోభన కర్ములు వసిష్ఠుని స్తోత్రములను రక్షింతురు మీరు కలకాలమగా వసిష్ఠుని కర్మములను పూరించుచున్నారు

3 మిత్రావరుణులారా ! మీరు విశాలభూమిని పరిక్రమించినారు గుణ, రూపములందు విశాలమగు ద్యులోకమును చుట్టివచ్చినారు ఓషధులు ప్రజలకొఱకు విభిన్న రూపములు దాల్తురు నిర్నిమేష భావమున సన్మార్గగామిని పాలింతురు

4 ఋషీ ! నీవు మిత్రావరుణులను స్తుతించుము తమమహిమతోను మిత్రావరుణులను స్తుతించుము తమ మహిమతోను మిత్రావరుణుల బలమువలనను ద్యావాపృథ్వులు విడివిడిగా ఉన్నవి యజ్ఞము చేయనివారి మానములు పుత్రరహితములై గడువవలెను యజ్ఞవృద్ధి మానవ వృద్ధికి కావలెను

5 మిత్రావరుణులు వ్యాపకులు కోటికలు తీర్చువారు ప్రాజ్ఞుడా ! నీవు వారిని స్తుతించినావు ఆశ్చర్యకరమగు నీ స్తుతికి చకితులైన మిత్రావరుణులు వారి యజ్ఞమును, పూజను ఎరుగలేకున్నారు ద్రోహులగు జనులు మిథ్యాస్తుతులను సేవింతురు మీ ఉభయులకొఱకు చేయబడిన స్తుతులు అజ్ఞానకారకములుకారాదు

6 మిత్రావరుణులారా ! మీ ఉభయుల యజ్ఞమున ఈ స్తుతి ఉచ్చరించబడినది దీనిని స్వీకరించండి త్వరత్వరగా మా విపత్తులను దూరము చేయండి మమ్ము దరికి చేర్చండి

## అరువది రెండవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-సూర్యుడు-మిత్రావరుణులు ఛందస్సు-త్రిష్టుప్

1 సూర్యుడు, అత్యధికమగు తేజమున ఊర్ధ్వముఖుడై వెలుగవలెను మానవులందరకు ఆశ్రయము ఇవ్వవలెను అతడు పగలు అందకాడై ఒకేరూపమున దర్శనమిచ్చును సర్వకర్త, కృతప్రజాపతినుండి సూర్యుడు వెలుగులు అందుకొనును

2 సూర్యా ! నీవు స్తుతుడవై, హరితవర్ణ, గమనశీల అశ్వములపై ఊర్ధ్వముఖుడవగుము మాముందునకు విచ్చేయుము మిత్ర, వరుణ, ఆర్యమ, అగ్నిముందు మమ్ము నిరపరాధులనుగా చెప్పుము

3 వరుణ, మిత్రాగ్నులు దుఃఖనివారకులు సత్యవంతులు ప్రసన్నతా దాయకులు వారు మాకు వేలకొలది ధనములను ఇవ్వవలెను స్తుతింపదగినవియు పూజనీయములగు పదార్థములీయవలెను మా స్తుతులను అందుకొని మా కోటికలు తీర్చవలెను

4 మహా ద్యావాపృథ్వులారా ! మమ్ము రక్షించండి మేము మంచి జన్మలవారలము మిమ్ము ఎరుంగుదుము మేము వరుణుని వాయువుయొక్క మానవులప్రియతముడగు మిత్రుని క్రోధమున పడరాదు

5 మిత్రావరుణులారా ! మీ బాహువులు చాచండి, మేము బ్రతుకుటగాను వ గోమార్గ భూమిని నీటితో తడపండి మానవులందు మమ్ము విఖ్యాతులను చేయండి మీరు సత్యా తరుణులు మా పిలుపు వినండి

6 మిత్రావరుణ ఆర్యయులారా ! మా కొఱకును, మా పుత్రులకును ధనము ప్రదానము చేయండి మేము చేరవలసిన దారులన్నియు సుగమములు కావలెను *"యూయంపాతస్వస్తిభిః సదానః"*

## అరువది మూడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-సూర్యుడు-మిత్రావరుణులు ఛందస్సు-త్రిష్టుప్

1 మిత్రావరుణులు శోభన భాగ్యులు సర్వదర్శకులు సమస్త మానవులకు సాధారణులు వారికి నేత్రరూపుడు, ప్రకాశమానుడగుసూర్యుడు ఉదయించుచున్నాడు సూర్యుని చర్మమువంటి అంధకారమును సంవేష్ఠించును

2 సూర్యుడు మానవులకు ఉత్పాదకుడు మహామహుడు సర్వసూచకుడు అతడు ఒకే ఒక చక్రమును త్రిప్పుటకు ఉదయించును రథమునకు కట్టిన హరిత అశ్వములు అతనిని మోయును

3 అత్యంత ప్రకాశమానుడగు సూర్యుడు స్తోతల స్తోత్రముల వినుటలో ఉన్మత్తుడై ఉషలమధ్య ఉదయించును అతడు మాకు కోఱిన పదార్థములు ఇచ్చును అతడు సర్వసముడు తన తేజమును సంకుచితము చేయడు

4 దూరగామి, త్రాత, దీప్తిమంతుడగు సూర్యుడు శుభంకురడై, బహుతేజవంతుడై అంతరిక్షమున ఉదయించును జీవులన్నియు సూర్యునినుండియే ఉత్పన్నములగును కర్తవ్యకర్మలు నిర్వహించును

5 అమరులగు దేవతలు సూర్యునికొరకు మార్గముపరచినారు అది గతిపారాయణమగు గ్రద్దవలె అంతరిక్షమున సాగును మిత్రావరుణులారా! సూర్యోదయమైనది ప్రాతస్సవనమున మీకు నమస్కరించి, హవ్యములందించి మిమ్ము సేవింతుము

6 మిత్రావరుణ ఆర్యములారా ! మాకు, మా పుత్రులకు ధనము ప్రదానము చేయండి మేము సాగవలసిన మార్గములను సుగమములు చేయండి *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## అరువది నాలుగవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-మిత్రావరుణులు ఛందస్సు-త్రిష్టుప్

1 మిత్రావరుణులారా ! మీరు ద్యులోక భూలోకములందు జలములకు స్వాములు మీరే మేఘములకు జలరూపము కలిగింతురు మిత్రుడు, సుజన్మ ఆర్యమ రాజు, బలివరుణుడు మా హవ్యమును స్వీకరించవలెను

2 మీరు రాజులు మహా యజ్ఞరక్షకులు సింధుపతులు వీరులు మావద్దకు విచ్చేయండి శీఘ్రదాతలగు మిత్రావరుణులారా ! అంతరిక్షమునుండి మాకు అన్నము వర్షము పంపండి

3 మిత్రావరుణులు, ఆర్యమ ఉత్తమ మార్గమున మమ్ము నడిపించవలెను ఆర్యమ మంచిదాతకు మా కథ వినిపించవలెను మీ రక్షణలందు మేము అన్నవంతులమై, పుత్రపౌత్రాదుల సహితులమై ప్రమత్తులముకావలెను

4 మిత్రావరుణులారా ! మీరు రాజులు మనసు లగ్నముచేసి మీకొఱకు ఈ రథము నిర్మించినవానికి, ఉత్తమ కర్మలు చేసినవానికి, యజ్ఞమున మిమ్ము స్మరించువానికి జలమును, అందమగు నివాసమున ఇచ్చి సంతృప్తుని చేయండి

5 మిత్రావరుణులారా ! మీ కొఱకుగాను వాయువు కొఱకును దీప్తమగు సోమమువంటి సోమము సిద్ధమైనది మీరు మా కర్మములందు ప్రవేశించండి మా స్తుతులకు గమనించండి *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## అరువది ఐదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-మిత్రావరుణులు ఛందస్సు-త్రిష్టుప్.

1 మిత్ర, శుద్ధ బల వరుణులారా ! సూర్యోదయముకాగా మీ ఉభయులను నేను స్తుతులతో ఆహ్వానింతును మీ బలము అక్షయము ప్రరము యుద్ధము జరిగినపుడు మీరు విజయ వంతులగుదురు

2 వారిద్దరు దేవతలలో అసురులు బలవంతులు ఆర్యులు అందరకు ప్రభువులు

మిత్రావరుణాలారా ! మేము మిమ్ము వ్యాపింప చేయుదుము మీ వ్యాపకతలో ద్యావాపృథ్వులు, రాత్రింబవళ్ళు మమ్ము ఆప్యాయితులను చేయును

3 మిత్రావరుణుల వద్ద అనేక పాశములు ఉన్నవి యజ్ఞము చేయనివారిని అబద్ధములాడు వారిని వారు ఆ పాశములతో బంధింతురు వారు శత్రువులకు దురతిక్రములు వారు మమ్ము పడవతో నదిని దాటించినట్లు యజ్ఞమార్గమున పాపములనుండి దాటింతురు

4 మిత్రావరుణులారా ! మా హవ్యము స్వీకరించుటకు విచ్చేయండి అన్న సహితముగా మా గోచర భూమిని జలసిక్తము చేయండి ఈ జగములందు మీకు ఉత్కృష్ట హవ్యము ఇవ్వగలవాడు ఉన్నాడా? మీరు లోకములకు స్వర్గీయము, రమణీయమగు జలమును ప్రసాదించండి

5 మిత్రావరుణులారా ! మీకొఱకును, వాయువు కొఱకును దీప్తమగు సోమమువంటి సోమము సిద్ధమైనది మీరు మా కర్మములందు ప్రవేశించండి మా స్తుతులను గమనించండి *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## అరువది ఆరవ సూక్తము

### ఋషి-వశిష్ఠుడు, దేవత-మిత్రావరుణులు-సూర్యుడు ఛందస్సు-వివిధము

1 మరల మరల ఆవిర్భవించు మిత్రావరుణుల సుఖకర, అన్నవంత సూక్తము సాగుచుండవలెను

2 శోభనబలవంతులు, బలముల రక్షకుల, విశిష్ట తేజోవంతులగు మిత్రావరుణుల బలములకొఱకు దేవతలు నిలిచినారు

3 మిత్రావరుణులారా ! మీరు గృహములను, దేహములను పాలించువారు మీరు స్తోతల కర్మరూప స్తోత్రములను సఫలము చేయండి

4 మిత్ర, సవిత, ఆర్యమ, భగులారా ! మీరు పాప నాశకులు సూర్యోదయమైనంతమీరు, నేడు, మాకొఱకు, అపేక్షిత ధనమునుపంపండి

5 శోభన దాన పారాయణులారా! మా పాపములను దూరము చేయండి మీరు చేరిన ఇల్లు సురక్షితము అగుగాత

6 మిత్రాదులు అదితి అహింసక వ్రతములకు ఈశ్వరులు వారు మహాధనములకు కూడ ఈశ్వరులు

7 సూర్యోదయమైనంత మిత్రావరుణులను శత్రుభక్షక ఆర్యమను నేను నుతింతును

8 ఈ స్తుతి హితకరము రమణీయమగు ధనముతో పాటు మాకు అహింసనీయబలము నీయవలెను

9 మిత్రావరుణులారా ! ఋత్విక్కులతో కలిసి మేము మీ స్తోతల మగుదుము మేము ధనము, బలము సహితము దాల్చెదము

10 మిత్రాదులు మహాసూర్యునివలె దీప్తులు అగ్ని జిహ్వలు యజ్ఞవర్ధకులు వీరులయి విశాలప్రదేశములను ప్రదానము చేస్తారు

11 మిత్రావరుణ ఆర్యములు సంవత్సరములు, మాసములు, దినములు, రాత్రులు, మంత్రములను ఏర్పరచినారు ఆరు శోభాయమానులై ఏ ఇతరులకు లేనంతటి బలము కలవారైనారు

12 మిత్రావరుణ ఆర్యములారా ! నేడు సూర్యోదయమైనంత సూక్తములతో మిమ్ము స్తుతింతుము మీ వద్ద ఉన్న ధనమును యాచింతుము

13 నేతలారా ! మీరు ఋతవంతులు ఋతజాతలు ఋతవర్ధకులు భయానకులు ఋతహీనుల ద్వేషులు మీవద్ద సుఖములనిచ్చు ధనము ఉన్నది దానికి ఇతర ఋత్విక్కుల సహితముగా మేము హక్కుదారులము అగుదుము

14 అది దర్శనీయ మండలము అది అంతరిక్ష సమీపమున ఉదయించుము హరితవర్ణ, శీఘ్రగామి అశ్వములు ఆ మండలమును వహించును అందరకు దర్శనము చేయించును

15 సూర్యుడు శీర్షములకు శీర్షము సకల స్థావరజంగమ భర్త రథారోహి, పిడు శీఘ్రగామి, హరితవర్ణలు లోక కళ్యాణమునకుగాను సమస్త జగములముందుకు సూర్యుని తెచ్చును

16 అతడు నేత్రము వంటివాడు దేవతల హితముకోరువాడు నిర్మలుడు సూర్యమండలమున ఉదయించుచున్నాడు మేము నూరేళ్లు చూడవలెను నూరేళ్లు జీవించవలెను *"పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతమ్"*

(నూరేళ్లు జీవించటం మాత్రంచాలదు నూరేళ్లు కన్నులుండి జీవించవలె అవయములన్నియు చక్కగా ఉండి జీవించవలెనను ఆశయము)

17 మిత్రావరుణులారా ! మీరు అహింసనీయులు ద్యుతిమంతులు మా స్తోత్రములు వినుడు సోమపానమునకు విచ్చేయుడు

18 మిత్రావరుణులారా ! మీరు ద్రోహరహితులు మీరు ద్యులోకమునుండి రారండి శత్రువును హింసించండి సోమపానము చేయండి

19 మిత్రావరుణులారా ! మీరు యజ్ఞనేతలు ఆహుతులు సేవించండి యజ్ఞవర్ధకులు కండి, సోమపానము చేయండి

## అరువది ఏడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అశ్వినులు ఛందస్సు-త్రిష్టుప్

1 అశ్వినులారా ! మేము హవ్యయుక్త స్తోత్రములతో మీ రథమును స్తుతించున్నాము కొడుకు తండ్రిని లేపినట్లు మీ రథము దూతవలె జగములను లేపును ఆ రథమే మా ముందుకు రావలెనని పిలుచుచున్నాను

2 మేము సమిధలు అర్పింతుము అగ్ని ప్రజ్వరిల్లును అప్పుడు చీకటిచోట్లనుకూడ జనులు చూడగలరు సూర్యుడు ప్రజ్ఞాపకుడు అతడు ద్యులోకదుహిత ఉషయొక్క పూర్వదిశన అందములు సంతరించుకొని ఉదయించును అప్పుడు అందరు అతనిని తెలిసికొందురు

3 నా సత్యద్వయమా ! సుందరహోత, స్తుతివక్త, స్తోమముతో మేము మిమ్ము సేవింతుము స్తోత్ర ఫల స్వరూపులై మీరు పూర్వ మార్గమున జలజ్ఞాత ధనయుక్త రథమున మాముందు అవతరించండి

4 అశ్విద్వయమా ! మీరు రక్షకులు, మధుర సోమయోగ్యులు సోమాభిషవమైనంత, మిమ్ముకోటి, ధనాభిలాషినై, నేను మిమ్ము స్తుతింతుము మీ ప్రవృద్ధ అశ్వము మిమ్ము తీసికొనిరావలెను మీరు మధురసోమము ఆరగించవలెను

5 అశ్వినులారా ! మాబుద్ధి, ధనాభిలాషిణి సరళ హింస ఎరుగనిది దానిని లాభయోగ్యముచేయండి యుద్ధమునందును మా బుద్ధిని రక్షించండి మాకు కర్మమూలమగు ధనమును ప్రసాదించండి

6 అశ్వినులారా ! మా కార్యములందు మీరు మమ్ము రక్షించండి మా వీర్యము క్షీణించరాదు పుత్రోత్పాదక సమర్థముకావలెను మాపుత్ర, పౌత్రులను అనుగ్రహించండి వారు కోటిన ధనము ప్రసాదించండి మేము ధనవంతులమై యజ్ఞములు దర్శించుచుందుము

7 మధుప్రియ అశ్వినీకుమారులారా ! మిత్రుని కొఱకుగాను దూత ముందుగా వెళ్లినట్లు మేము సంకల్పించిన సోమము నిధిస్వరూపమున మీముందు సమర్పించబడినది కావున క్రోధశూన్య చిత్తమున మాముందుకు ఏతెంచండి మానవరూప ప్రజల హవిని ఆరగించండి

8 అందరినిపోషించు అశ్వినీ ద్వయమా ! మీరు ఇద్దరు కలిసినంత మీ రథము ఏడు ఏరులు దాటివచ్చును మీ అశ్వములు సుజన్మలు దేవసంపన్నులు అవి మిమ్ము మోయును మీ రథములాగును కాని అలసట ఎరుగవు

9 మీరు ఆసక్తిరహితులు ఏ ధనవంతుడు ధనముకొఱకు, దాతవ్య హవ్యము అర్పించునో, ఎవడు మిత్రుని సత్యవచనచములతో వర్థిల్లచేయునో, ఎవడు గోవులు, అశ్వములు, ధనము దానముచేయునో అట్టివారి కొఱకే మీరు కలిగినారు

10 మీరు నేడు మా పిలుపు ఆలకించండి, నిత్యతరుణ అశ్విద్వయమా ! మీరు హవ్యవంత గృహమునకు విచ్చేయండి రత్నములిచ్చిస్తోతలను వర్థిల్లచేయండి *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

## అరువది ఏనిమిదవ సూక్తము

### ఋషి-వశిష్ఠుడు, దేవత-అశ్వినులు ఛందస్సు-1-7 విరాజము, 8,9 త్రిష్టుప్.

1 దీప్తివంతులు, అశ్వవంతులగు అశ్వినులారా ! రండి మీరు శత్రుహంతలు మీ భక్తుల స్తుతులను స్వీకరించండి మేము అర్పించు హవ్యమును ఆరగించండి

2 అశ్వినులారా ! మీ కొఱకు మాదక సోమము సిద్ధముగా ఉన్నది మా హవ్యము అందుకొనుటకు త్వరత్వరగారండి మా శత్రువుపిలుపును వినిపించుకోక మా పిలుపు వినండి

3 అశ్వినులారా ! మీరు రథమున సూర్యపుత్రి సహితులై ఉందురు మీ రథము మనోవేగము గలది అపార రక్షణలున్నది మేము మీ రథమును ప్రార్థింతుము అది సకల లోకములను వదిలి మా యజ్ఞమునకే వచ్చును

4 నేను మిమ్ము దేవతలుగా ప్రతిష్ఠించదలచినప్పుడు సోమాభిషవమునకు అభిషవ శిలలు గంభీర ధ్వనిచేయునప్పుడు అప్పుడు విప్రులు మిమ్ము హవ్యములిచ్చి ఆహ్వానింతురు

5 మీవద్ద చిత్రవిచిత్రమగు ధనమున్నది అది మాకు అందించండి మీకు ప్రియులై, మీరు అందించిన సుఖములు అనుభవించువారిని విపత్తులనుండి విడదీయండి

6 అశ్వినులారా ! చ్యవనుడు వృద్ధుడు మీకు హవి సమర్పించువాడు అతనికొఱకు మీరు మృత్యువువద్ద నుండి ఒక రూపము తెచ్చి ఇచ్చినారు ఆ రూపమే అతనిని దాల్చినది

(వృద్ధుడగు చ్యవనుని అశ్వినులు యువకుని చేసినారనునది ప్రసిద్ధగాధ చ్యవన ప్రాశ మను ఔషధమును ఈ చ్యవనుని పేరిటిదే)

7 దుష్టులగు మిత్రులు భుజ్యుని సముద్ర మధ్యమున వదలినారు మీరు అతనిని దరికి చేర్చినారు భుజ్యుడు మిమ్ము ప్రార్థించినాడు ఎన్నడు విరుద్ధాచరణము చేయలేరు

(భుజ్యుడు లాహోనయన వంశజుడు యాజ్ఞవల్క్యుని సమకాలికుడని బృహదారణ్యక ఉపనిషత్తులో చెప్పబడింది )

8 అశ్వినులారా ! వృకమహర్షి క్షీణించినపుడు మీరు మీ సామర్థ్యమున అతనికి ధనము ఇచ్చినారు శయు మహర్షి మిమ్ము పిలువగా మీరు అతని పిలుపు విన్నారు నదులను జలములు నింపినట్లు అతని ముసలి ఆవును పాడి ఆవును చేసినారు

(వృకుడు వృక విధ్వంసుకుడు కావచ్చును వృకనామక ఋషికావచ్చును వృకధ్వరస్ వ్యతిరేకముగ యుద్ధము జరిగినది ఇతడు ఇరాన్ దేశపువాడని హిల్లెబ్రాంట్ అభిప్రాయము

శయునకు చెందిన ముసలి ఆవును అశ్వినులు పాలిచ్చు ఆవును చేసినారని వృత్తాంతము )

9 స్తోత వసిష్ఠుడు నిర్మల మనస్కుడై ఉష కన్న ముందు మేల్కొని సూక్తములతో స్తుతించును అతని అన్నమును వర్ధిల్లచేయండి అతని పాడిని వర్ధిల్ల చేయండి అతని గోవులను వర్ధిల్ల చేయండి *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## అరువది తొమ్మిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అశ్వినులు ఛందస్సు-త్రిష్టుప్

1 తరుణ అశ్వినులతో రథము రావలెను ఆ రథము హిరణ్మయము ద్యావాపృథ్వులందు రక్షించునది దాని చక్రములందు జలమున్నది ఇరుసున వెలుగున్నది అది అన్నవాహకము - యజమానులకు స్వామి

2 ఆ రథము పంచభూతములను ప్రసిద్ధముచేయు మూడు బంధురములు ఆసనములు కలది అది స్తుతి యుక్తము అశ్విద్వయమా ! మీరు ఈ రథముపై మీరు కోరినచోటికి దేవాభిలాష యజ్ఞమునకు వెళ్లండి

3 సుందర అశ్వములను విశేష అన్నమును తీసికొని మా వద్దకు రండి మీరు మధుమంతనిధి సోమమును పానము చేయండి మీ రథము సూర్యగమనము కలది దాని చక్రములు వేగమునకు ద్యులోకము అణగిపోవును

4 రాత్రిళ్లు సూర్యపుత్రి మీ రథమును అలముకొనును మీరు దేవాభిలాషిని కర్మద్వారా రక్షించినపుడు రక్షణకు అవసరమైన దీప్తివంతమగు అన్నము మీవద్దకు చేరును

5 రథవంతులగు అశ్విద్వయమా! మీ రదము వెలుగులు కప్పుకొనును అశ్వములకూడి పయనించును ఉషోదయమున ఆ రదమున మావద్దకు రండి పాపములను వదిలించండి సుఖములను కలిగించండి

6 అశ్విద్వయమా ! గౌరామృగివలె విశేష దీప్యమాన సోమము సేవించగోరి మా యజ్ఞమునకు రావలిసినది అనేక యజ్ఞములందు యజమానులు మిమ్ము ఆహ్వానింతురు కావున అన్యదేవాభిలాషులు మిమ్ము కోరరాదు

7 అశ్వినులారా ! సముద్రమున మునిగిన భుజ్యుని అక్షత అశ్రాంత, శీఘ్రగామి, అశ్వములు మఱియు మీ కార్యనైపుణ్యమున జలములు దాటించి రక్షించినారు

8 సదాతరుణ అశ్వినులారా ! నేడు మా ఆహ్వానములు వినండి హవ్యవంత గృహమునకు విచ్చేయండి రత్నములందించి స్తోతను వర్ధిల్ల చేయండి *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## డెబ్బదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అశ్వినులు ఛందస్సు-త్రిష్టుప్

1 అశ్వినులారా ! మీరు అందరి వరణీయులు మా యజ్ఞ వేదికపైకి రండి భూమి మీద ఇదే మీస్థానమని చెప్పుదురు మీరు ఆసీనులగు అశ్వపు వీపు సుఖప్రదము కావలెను ఆ గుఱ్ఱము ఎల్లప్పుడు మీ వద్దనే ఉండవలెను

2 ఈ స్తుతి అత్యంత అన్నవంతము సుందరము ఇది మిమ్ము సేవించును మానవ యజ్ఞగృహమున ధూపము నిండి ఉన్నది అది మీకు లభించును అది ఒక ధామము అది జలము, సముద్రములతో నిండును రథమున అశ్వములను పూన్చినట్లు యజ్ఞమున మిమ్ము పూన్చబడును

3 అశ్వినులారా ! మీరు ద్యులోకమునుండి వచ్చెదరు ఓషధులు, జనులమధ్య స్థానము ఏర్పరచుకొందురు పర్వత శిఖరమున కూర్చుందురు అన్నదాతకు ఆచోటు ఇవ్వండి

4 దేవద్వయమా ! ఋషులు ఏర్పరచిన ఓషధులు, జలములను మీరు వ్యాపింప చేయుదురు అందువలన మీరు ఓషధులను చరుపురోడాశాదులను, జలమును సోమరసమును కోరండి మాకు బహురత్న దానము చేయండి మీరు పూర్వదంపతులను అట్లే ఆకర్షించినారు

5 అశ్వినులారా ! మీరు శ్రుతిమంతులు అనేకములు విన్నవారు ఋషుల అనేక కర్మములను

దర్శించినారు మీరు యజమాని యజ్ఞమునకు విచ్చేయండి మాకు మీ అత్యంత అన్నపూర్ణ అనుగ్రహము కావలెను

6 నా సత్యద్వయమా ! హవ్యయుక్తుడు, కృతస్తోత్రుడు, మానవులతో కలిసి ఉండు వసిష్ఠుని వద్దకు విచ్చేయండి ఆ స్తోత్రములన్నియు మిమ్ములనే స్తుతించును

7 అశ్వినిద్వయమా ! ఈ స్తుతియు ఈ వచనమును మావియే ఈ శోభన స్తుతులను స్వీకరించండి సకల కర్మలు మిమ్ము కోఅవలెను మీతో సంగతము కావలెను *"యూయంపాతస్వస్తిభిః సదానః"*

(ఆంధ్ర వచన ఋగ్వేద సంహిత ఏడవ మండలము ఐదవ అష్టకమున నాలుగవ అనువాకము సమాప్తము

అయిదవ అనువాకము డెబ్బది ఒకటవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-అశ్వినులు, ఛందస్సు-త్రిష్టుప్

1 రాత్రి తన సోదరి ఉషనుండి స్వయముగనే తొలగిపోవును నల్లనిరేయి ఎర్రని సూర్యునకు దారి ఇచ్చును అందువలన అశ్వధన, గోధన అశ్వినులారా ! మిమ్ము మేము పిలుచుచున్నాము రాత్రింబవళ్లు మావద్దనుండి హింసకులను దూరము చేయండి

2 అశ్వినిద్వయమా ! హవ్యదాతకు రథమున రమణీయ పదార్థములు తీసికొనిరండు అన్న దారిద్ర్యమును, వ్యాధులను దూరము చేయండి మమ్ము రాత్రింబవళ్లు రక్షించండి

3 మీ రథము అనాయాసముగ జోడించబడిన కోర్కెలు తీర్చు అశ్వములు మిమ్ము తీసికొని రావలెను రశ్మివంతము, ధనవంతమగు రథమును జలదాతలగు అశ్వములతో లాగించండి

4 యజమానుల పాలకులారా ! మీరు ఎక్కురథము మూడు ఆసనములు గలది ధనవతి, దినమును పట్టిసాగునది వ్యాపించి అరుగునది అట్టి రథము మీదనే మీరు మావద్దకు రావలెను

5 మీరు చ్యవనుని ముసలితనము వదిలించినారు పేరునామక రాజు కొఅకు యుద్ధమున వడిగల గుఱ్ఱమునంపినారు అత్రి, అంధకారమును పాపమును దూరము చేసినారు భ్రష్ట రాజ్యుడయిన జాహుషునకు తిరిగి రాజ్యము ఇప్పించినారు

6 అశ్వనిద్వయమా ! ఈ స్తుతియు ఈ వచనమును మీదియే ఈ శోభన స్తుతులను స్వీకరించండి సకల కర్మలు మిమ్ము కోఅవలెను మీతో సంగతము కావలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## డెబ్బది రెండవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అశ్వినులు, ఛందస్సు-త్రిష్టుప్

1 నా సత్యద్వయమా ! మీరు గోవులు, అశ్వములు, ధనముతోకూడిన రథముపై రాగలరు అనేక స్తుతులు మిమ్ము సేవించును మీరు అభిలషణీయ శోభ మఱియు దేహముతో దీపించండి

2 నా సత్యద్వయమా! మీరు దేవతలలో సమానప్రీతి యుక్తులయి రథమునెక్కి విచ్చేయండి మీతో మా బంధుత్వము పూర్వజులనుండి కొనసాగుచున్నది మీకు మాకు ఒకరే బంధువులు పితామహులు వారి ధనము సహితము ఒక్కటే

(వివస్వతుని నుంచి వరుణుడు, అశ్వినులు కలిగినారు వసిష్ఠుడు వరుణ సంబంధి అందువలన బంధుత్వము వివస్వతుడు ఉభయులకు పితామహుడు)

3 అశ్వినులకు స్తుతులు జాగృతులను చేయును బంధుస్థానీయములగు సకల కర్మలు ప్రకాశమాన ఉషను జాగృతము చేయును మేధావి వసిష్ఠుడు స్తుతులతో ద్యావాపృథ్వులను సేవించును అశ్వినుల ముందు స్తుతులు చదవును

4 అశ్విద్వయమా ! ఉషస్సు అంధకారమును తొలగించగా సోత్తలు విశేషరూపమున నిన్ను స్తుతింతురు సవిత ఊర్ధ్వతేజమును ఆశ్రయించును సమిధలతో అగ్ని స్తుతించబడును

5 నా సత్యద్వయమా ! తూర్పు, పడమర, దక్షిణ, ఉత్తర దిశలనుండి రండి రారండి పంచజనులకు హితవు కలిగించు సంపద తీసికొని రండి రారండి *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

## డెబ్బది మూడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అశ్వినులు, ఛందస్సు-త్రిష్టుప్

1 మేము దేవాభిలాషులమగుదుము స్తుతింతుము అజ్ఞానమును దాటిపోవుదుము బహుకర్మ, ప్రభూత తమ పూర్వజాత, అమర్త్య అశ్విద్వయమా ! మిమ్ము స్తోతలు పిలుచుచున్నారు

2 అశ్వినులారా ! మీకు ప్రియుడగు మానవ స్తోత ఇక్కడ ఉన్నాడు అతడు మీ యజ్ఞము చేయును మాకు వందనము చేయును అతనివద్ద నిలిచి అతడు అందించిన సోమరసము సేవించండి అన్నవంతుడనై యజ్ఞమునకు మిమ్ము ఆహ్వానింతును

3 మేము స్తోతలము మేము ఆగమనశీల దేవతల కొఱకు యజ్ఞమును పెంపొందింతుము అశ్వినులారా ! ఈ స్తుతిని స్వీకరించండి ఏను వశిష్ఠుడ శీఘ్రగామి దూతవలె మీ వద్దకు చేరి, మిమ్ము స్తుతించి ప్రబోధితుడనగుదును

4 వీరిద్దరు హవ్యవాహహకులు రాక్షస నాశకులు పరిపుష్టాంగులు దృఢపాణులు వారు మా ప్రజవద్ద విరాజిల్లవలెను మీరు మదకర అన్నముతో కూడి ఉండండి మమ్ము బాధించకండి *"ఆగతమ్ శివేన"* శుభములతో విచ్చేయండి

5 నా సత్యద్వయమా ! తూర్పు, పడమర, దక్షిణ ఉత్తర దిశలనుండి రండి రారండి పంచజనులకు హితవు కలిగించి సంపద తీసికొనిరండి-రారండి *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## డెబ్బది నాలుగవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-అశ్వినులు, ఛందస్సు-బృహతి

1 నివాప్రదులగు అశ్వినులారా ! స్వర్గముకోరు జనులు మిమ్ము ఆహ్వానింతురు మీరు విశేష వ్యక్తుల వద్దకే వెళ్లుదురు అందువలన వసిష్ఠడను - రక్షణకొఱకు మిమ్ము పిలుచుచున్నాను కేకవేయుచున్నాను

2 అశ్వినులారా ! మీ వద్ద విచిత్ర భోజ్య ధనము ఉన్నది దానిని స్తోతవద్దకు పంపండి సమాన మనసుగలవారై మీ రథమును మా వద్దకు పంపండి సోమ సంబంధమగు మధుర రసము సేవించండి

3 అశ్వినులారా ! రండి మావద్ద నిలువండి మధుర సోమరసము పానము చేయండి అభీష్టవర్షకులు ధనంజయులగు మీరు జలములను ఇవ్వండి మమ్ము బాధించవద్దు

4 అశ్వినులారా ! మీ అశ్వములు మిమ్ము హవ్యదాత గృహమునకు కొనిపోవును అట్టి శీఘ్రగామి అశ్వములపై మమ్ము చేరగోరి విచ్చేయండి

5 అశ్విద్వయమా ! స్తోతలు మరింత అన్నమును ఆశ్రయింతురు మీరు మాకు చలించని కీర్తిని గృహమును ప్రసాదించండి మేము ధనికులము

6 ఇతరుల ధనము గ్రహించనివారు మానవులలో ఉండి మానవులను రక్షించువారు రదమువలె మీవద్దకు చేరువారు స్వబలమున వర్థిల్లుదురు నివసించుటకు మంచి ప్రదేశమునకు చేరుకొందురు

## డెబ్బది ఐదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఉష, ఛందస్సు-త్రిష్టుప్

1 ఉష అంతరిక్షమున ఆవిర్భవించినది వెలుగులు తెచ్చినది ఆమె తన తేజోబలమున తన మహిమను ప్రకటించుచు వచ్చినది అప్రియ అంధకారమును దూరము చేయుచు వచ్చినది ప్రాణికోటి తమ కార్యనిర్వహణకుగాను గంతవ్య మార్గమును ప్రకాశింప చేయుచు వచ్చినది

2 ఉషా ! నేడు మాకు సుఖములిచ్చుటకు మేల్కొనుము మహా సౌభాగ్యమును అందించుము విచిత్ర కీర్తియుక్త ధనమును మా కొఱకు అందుకొనుము మానవ హితకారిణీ ! మానవులకు అన్నవంతులగు పుత్రులనిమ్ము

3 ఉషఃకిరణములు దర్శనీయములు ప్రవృద్ధములు అవి నాశ్యములు దేవతల వ్రతముల ఉత్పాదకములు అవి అంతరిక్షమును నింపును అనేక ప్రకారముల వ్యాపించును

4 ఆమె ద్యులోకదుహిత భువన పాలిక అట్టి ఉష ప్రాణులందరి ప్రజ్ఞానులను దర్శించుచు ఇతర వ్యవహారములను వీక్షించుచు పంచజనుల వద్దకు త్వరత్వరగా చేరును

5 ఉష అన్నవతి సూర్యపత్ని విచిత్ర ధనవతి ఆమె ఇప్పుడు ధనములకు, దేవధనములకు స్వామిని అయినది ఋషులతో స్తుతించబడినదియు, వార్ధక్యము కలిగించునదియు, ధనవతియు అగు ఉష యజమానిచే స్తుతించబడి ప్రభాతము కలిగించును

6 దీప్తివంత ఉషను వహించు విచిత్రములు, శుభప్రదములగు అశ్వములు గోచరించుచున్నవి ఉష దీప్తిమతి అయి అనేక రూపముల రథమున సర్వత్ర పయనించును ఆమె తన సేవకులకు రత్నములిచ్చును *"రత్నంవిధతే జనాయ"*

7 ఉషోదేవి సత్యరూప, మహతి యజనీయ ఆమె మహామహులు, యజనీయులగు దేవతలతో కలిసి అత్యంత స్థిర అంధకారమును చెదరగొట్టును ఆమె గోవులు మేయుటకు వెలుగునిచ్చును గోవులు ఉషస్సును కోరుకొనును

8 ఉషా ! మాకు గోవులు, వీరులు, అశ్వసహిత ధనమునిమ్ము మానవులలో మా యజ్ఞమును నిందింపకుము *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## డెబ్బది ఆరవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఉష, ఛందస్సు-త్రిష్టుప్

1 సవిత అందరినేత అంతరిక్షమున అవినాశ్యము, సర్వహితైషి అయిన జ్యోతిని ఆశ్రయించును అతడు దేవకర్మల కొఱకు వెలువడినాడు ఉష దేవతల నేత్ర స్వరూపిణి ఆమె సమస్త భువనములను వెలువరించినది

2 నేను హింసారహితుడను తేజోవంతుడను, సంస్కారవంతునయి దేవయాన పథమును చూచినాను ఉషోకేతనము తూర్పుదిశన ఎగురును మా ముందుకు ఉష ఉన్నత ప్రదేశము నుండి వచ్చును

3 ఉషా ! నీ తేజస్సు సూర్యునికన్న ముందు ఉదయించును అట్టి నీ తేజస్సు కులటవంటిది కాదు పతిసాన్నిధ్యమున ఉన్న పత్నివంటిది అట్టి నిష్కళంకమగు నీ తేజము అపారము అనంతము

4 అంగిరోగణములు సత్యవంతులు విద్వాంసులు ప్రాచీన పాలకులు వారు నిగూఢ తేజమును సాధించినారు సత్యస్తుతులయినారు అట్టి అంగిరులు మంత్రబలమున ఉషస్సును ఆవిర్భవింపచేసినారు అప్పుడు వారు దేవతలకూడి ఉన్మత్తులైనారు

5 వారు సాధారణ గోవులకొఱకు కలుసుకున్నారు ఏకబుద్ధులు అయినారు పరస్పర ప్రయత్నము కొనసాగించినారు వారు దేవకర్మలను బాధింరు హింసాశూన్యము వాసప్రదమగు తేజమున సాగుదురు

6 సుభగా ! ఉషా ! వశిష్ఠ గణములు తెల్లవారుజామున లేచినారు స్తోత్రములతో నిన్ను స్తుతించుచున్నారు నీవుగోప్రాపికవు అన్నపాలికవు మాకు తెల్లవారింపుము సుజన్మఉషా ! నీవు ప్రథమ స్తుతవు

7 ఈ ఉష స్తోతల స్తోత్రములకు నేతృత్వము వహించును వసిష్ఠులు ఆమెను స్తుతింతురు ఆ తల్లి చీకట్లను చీల్చును సర్వత్ర ప్రసిద్ధమగు ధనమును మాకు ఇచ్చును *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## డెబ్బది ఏడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఉష, ఛందస్సు-త్రిష్టుప్.

1 ఉష సమస్త జీవులకు కదలిక కలిగించును ఆమె ప్రాయపు పత్నివలె సూర్యుని నుండియే వెలుగులు పొందును అగ్ని మానవుల సమింధన యోగ్యుడయినాడు అగ్ని అంధకారనాశక తేజమును ప్రకటించును

2 ఉష ఉదయించినది - ఉదయించినది - ఉష జగముల ముందుకు వచ్చినది - వచ్చినది ఉష సర్వత్రవ్యక్తమైనది - అయినది ఆమేతేజోమయవనములు ధరించినది - ధరించినది వాటితో వర్ధిల్లినది - వర్ధిల్లినది

ఉష హిరణ్యవర్ణ దర్శనీయ తేజోయుక్త వాక్యమాత, దినములనేత ఉష అందములు సంతరించు కొనుచున్నది

3 ఉష దేవతలకు నేత్రస్వరూప తేజోవతి సుభగ స్వకిరణ ప్రకాశిత విచిత్ర ధనవతి జగముల కొఱకు ప్రవృద్ధ ఆమె దర్శించదగిన అశ్వమును తెలుపుచేయుచున్నది

(అశ్వము సూర్యుడగును)

4 ఉషా ! మా వద్దకు విచిత్ర ధనముతో రమ్ము మా శత్రువులను దూరము చేయుచురమ్ము మా విశాలగోచర భూమిని భయరహితము చేయుచురమ్ము ద్వేషులను వేరుచేయుచు రమ్ము శత్రువుల ధనము తీసికొని రమ్ము స్తోతవద్దకు ధనము అందుకొని రమ్ము

5 ఉషా ! మా ఆయువులను పెంచుము మా కొఱకు శ్రేష్ఠ కిరణములతో ప్రకాశింపుము నీవు అందరకు వరణీయువు మా కొఱకు గో, అశ్వధనమును దాల్చివెలుగొందుము

6 ద్యులోకదుహితా, సుజన్మా, ఉషా ! వసిష్ఠులు స్తుతులతో నిన్ను వర్ధిల్ల చేయుదురు నీవు మాకు రమణీయమగు మహాధనము నిమ్ము *"యూయం పాత స్వస్తిభిః సదా నః"*

## డెబ్బది ఎనిమిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఉష, ఛందస్సు-త్రిష్టుప్

1 తొలుత వెలసిన కేతనమును చూడనగును అది కిరణపుంజములతో ఊర్ధ్వముఖియై వ్యాపించినది మా ముందు నిలిచినది ఉషోదేవి రథము అది విశాలము జ్యోతిష్మంతము ఉష ఆ రథమును మా కొఱకు రమణీయ ధనము తేవలెను

2 సమిధలు కలిగిన అగ్గి అంతట ఎదుగును విప్రులు స్తుతులతో ఉషను కీర్తించి ఎదుగుదురు ఉషోదేవి తన వెలుగులతో చీకట్లను పాపములను పారద్రోలి ఎదుగును

3 ఈ సమస్త ప్రభాత కిరణములు, వెలుగులనిచ్చు ఉషలను తూర్పుదిక్కున చూడనగును ఈ కిరణములే సూర్యుని అగ్నిని, యజ్ఞమును ఆవిర్భవింపచేసినవి వాటివలననే నీచము అప్రియమయిన అంధకారము దూరమైనది

4 ద్యులోకపుత్రి, ధనవతి ఉషను ఎరిగినాము సర్వప్రాణులు ప్రభాతకారిణి ఉషను దర్శించుచున్నారు ఆమె అన్నముగల రథమున ఎక్కినది అలంకృత అశ్వములు ఆ రథమును లాగును

5 ఉషా ! మేము సుమనస్కులు, ధనవంతులగు జనులు నేడు నిన్ను మేల్కొల్పుచున్నాము ఉషలారా ! మీరు తెల్లవార్చండి జగముల వెలుగులు నింపండి

## డెబ్బది తొమ్మిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-ఉష ఛందస్సు-త్రిష్టుప్

1 ఉష మానవులహితము కోరునది అంధకారమును నాశనము చేయునది పంచశ్రేణి జనులను మేల్కొల్పునది ఉత్తమ తేజస్సుగల కిరణములతో సూర్యునకు ఆశ్రయము ఇచ్చును సూర్యుడు ఆ తేజస్సుతో ద్యావాపృథ్వులను ఆవరించును

2 ఉషస్సులు అంతరిక్షమున తేజస్సును వ్యక్తపరచుదురు మానవులవలె పరస్పరము కలిసి చీకట్లను తుడిచివేయు చర్యలు చేపట్టుదురు

ఉషా ! నీ కిరణములు అంధకారమును నాశము చేయును సూర్యుని భుజలములవె జ్యోతులు ప్రసాదించును

3 అందరిని మించిన స్వామిని, ధనవతి ఉష ఉదయించినది ఆమె సకల ప్రాణి కళ్యాణమునకుగాను అన్నము కల్పించినది స్వర్గపుత్రి సర్వోత్తమ అంగిర ఉష సుకృతములకొరకు ధనముదాల్చును

4 ఉషా ! నీవు ప్రాచీన స్తోతలకు ఇచ్చినంత ధనమును మాకును ప్రసాదించుము ప్రాణులు నిన్ను వృషభ శబ్దమున ఎరుగుదురు పణులు గోవులను దొంగిలించినప్పుడు నీవు దృఢపర్వత ద్వారమును తెరచినావు

5 ధనము కొఱకు స్తోతలను మా కొఱకు సూనృత వాక్యమును ప్రేరేపించుచు, తమోవినాశినివగుచు, మాకు దానము చేయుటకు నీ వృద్ధిని స్థిరపరచుకొనుము *"యూయంపాతస్వస్తిభిః సదానః"*

## ఎనుబదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-ఉష ఛందస్సు-త్రిష్టుప్.

1 ఉష సమానప్రాంత ద్యావాపృధ్వులను ఆవరించునది ప్రాణులను ప్రకాశమునిచ్చునది విప్రులగు వసిష్ఠులు అట్టి ఉషను అందరికన్నముందు మేల్కొలిపినారు

2 ఆమెయే నవయవన్వన ఉష, ఈమెయే కటిక చీకట్లను కూలద్రోసిన ఉష, ఈమెయే జనులను మేల్కొల్పిన ఉష

ఉష సిగ్గువిడిచిన పడుచువలె సూర్యునిముందుకు పోవును సూర్యునకు, అగ్నికి, యజ్ఞమునకు తనను సూచించును

3 ఉషస్సులు అనేక అశ్వములుగలవి గోవులు కలవి అవి స్తుతించ తగి` ,

ఉషస్సులు సదా అంధకారమును దూరము చేయును *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

*(ఆంధ్ర వచన ఋగ్వేద సంహిత ఏడవ మండలము ఐదవ అష్టకమున అయిదవ అధ్యాయము సమాప్తము )*

ఓం నతామినన్తిమాయినో నధీరావ్రతా దేవానాం ప్రథమాద్రవాణి
నరోదసీ అద్రుహా వేద్యాభిర్నపర్వతాని నమేత స్థివాంసః

ఆరవ అధ్యాయము ఎనుబది ఒకటవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు దేవత-ఉష, చందస్సు-బృహతి

*ఓం ప్రత్యు అదర్శ్యాయత్యుచ్ఛన్తీ దుహితాదివః*
*అపో మహివ్యాయతి చక్షసే తమో జ్యోతిష్కృణోతిసూరి*

1 ద్యులోకపుత్రి అంధకారినాశిని ఉష వస్తున్నది కనిపిస్తున్నది అందరు చూచుటకు ఆమె రాత్రియొక్క ఘోర అంధకారమును దూరము చేయును మానవులకు నేతృత్వము వహించును వెలుగులను వికసింపచేయును

2 సూర్యుడు కిరణములను ఒకేసారి విసరును సూర్యుడు వెలుగొంది గ్రహనక్షత్రాదులను వెలిగించును

ఉషా ! నీవి సూర్యుని వెలుగులు వచ్చిన తరువాతనే మాకు అన్నము కలుగును

3 ద్యులోకపుత్రి ఉషా! మేము శీఘ్రకర్ములమగుదుము నిన్ను మేల్కొలుపుదుము నీవు కోరదగిన అనంతధనము కలదానవు యజమానికొరకు రత్నములు, సుఖములు అందుకొనుము

4 మహతీదేవీ ! నీవు అంధకార నాశినివి మహిమలు కలదానవు సకల జగములను ప్రబోధితము చేయుదువు వానిని దర్శన యోగ్యము చేయుదువు నీవు రత్నవతివి మేము నిన్ను యాచించుచున్నాము తల్లికి కొడుకువలె మేము నీకు ప్రియతములము కావలెను

5 ద్యులోకదుహితా ! ఉషా ! అత్యంత దూర ప్రదేశమున ప్రఖ్యాతమయిన ధనము తెమ్ము నీ వద్ద మానవులకు భోజ్యమగు అన్నము ఉన్నదికదా అది మాకు ఇమ్ము మేము సహితము అనుభవింతుము

6 ఉషా ! స్తోతలకు అమరము, నివాసప్రదము మరియు ప్రసిద్ధమగు కీర్తని ప్రసాదించుము మాకు అనేక గోవులతో కూడిన అన్నము ప్రసాదించుము యజమానికి ప్రేరణ కలిగించునదియు, సత్యవచన ఉష శత్రువులను దూరము చేయవలెను

## ఎనుబది రెండవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-ఇంద్రావరుణులు, చందస్సు-జగతి

1 ఇంద్రావరుణులారా ! మేము మీ సేవకులము యజ్ఞకర్మమునకుగాను మాకు మహాగృహము ప్రసాదించుము అట్లయిన యజ్ఞకర్తను అదేవనిగ పీడించు దుర్బుద్ధిని యుద్ధమున జయించగలము

2 ఇంద్రావరుణులారా ! మీరు మహామహులు మహా ధనవంతులు మీలో ఒకరు వరుణుడు స్వామాట్టు మరొకరు ఇంద్రుడు స్వయం విరాజమానుడు ఉత్తమ ఆకాశమునందలి విశ్వదేవతలు మీకు తేజస్సును ప్రదానము చేసినారు బలమును ఇచ్చినారు

3 ఇంద్రావరుణులారా ! మీరు బలమున జలవృష్టిని ఆవిష్కరించినారు సర్వప్రేరకుడగు సూర్యుని ఆకసమున నడిపించినారు మాయసోమమున ఆనందించినారు ఇప్పుడు మీరు నదులను జలపూర్ణములుచేసి కర్మలను పూరించండి

4 ఇంద్రావరుణులారా ! స్తోతలు యుద్ధమందు, శత్రుసేనా మధ్యమున మిమ్మే పిలుతురు సంకుచితజానువులుగల అంగిరులు రక్షణకొఱకు మిమ్మే పిలుతురు మీరు దివ్య పార్థివ ఉభయ ధనములకు ఈశ్వరులు మీరు అనాయాసముగా ఆహ్వానయోగ్యులు మిమ్ము ఆహ్వానించుటకు ఆయాసము అక్కరలేదు సులభులు మేము స్తోతలము మేము పిలుచుచున్నాము

5 ఇంద్రావరుణులారా ! మీరు లోకములందలి సమస్తప్రాణులను సృష్టించినారు మీలో ఒకరిని వరుణుని శుభములకుగాను మిత్రుడు సేవించును మరొకరు ఇంద్రుడు మరుత్తులతో కలిసి తేజస్వియు శోభన అలంకృతుడను అగును

6 మహాధన ప్రాప్తికని, ఇంద్రావరుణులు వెలుగొందుటకును, శీఘ్రముగా బలము ప్రాప్తించును వీరి బలము నిత్యము అసాధారణము వీరిలో ఒకడు వరుణుడు హింసించువారిని పరిమార్చును మరొకరు ఇంద్రుడు స్వల్ప ప్రయత్నముననే శత్రువును వధించును

7 ఇంద్రావరుణులారా ! మీరు ఏనరుని యజ్ఞమున విరాజిల్లుదురులో, ఏ వ్యక్తిని అనుగ్రహింతురో వానిని బాధలు చేరలేవు పాపము చేరలేదు దుష్కర్మము చేరలేదు ఏకారణమునైనను సంతాపము చేరలేరు

8 నేతలగు ఇంద్రావరుణులారా! మీరు మా విషయమున ప్రసన్నులైనచో దివ్యరక్షణ సహితులై మాముందు అవతరించండి స్తోత్రములు వినండి మీ స్నేహము, బంధుత్వము సుఖదాయకములగును మాకు ఆ రెంటిని ప్రసాదించండి

9 శత్రుమర్దన తేజోవంతులగు ఇంద్రావరుణులారా ! విశేష సంగ్రామములందు మాకు అగ్రశ్రేణి

యోద్ధలుకండి మిమ్ము ప్రాచీన, అధునాతన ఉభయనేతలు యుద్ధమునకును పుత్ర పౌత్రాదుల ప్రాప్తికిని ఆహ్వానింతురు

10 ఇంద్ర, వరుణ, ఆర్యమలు, మాకు ప్రకాశమాన ధనమును, మహా విస్తీర్ణ గృహమును ప్రసాదించవలెను యజ్ఞవర్ధిక అదితి తేజము మమ్ము బాధించరాదు మేము సవితృ దేవుని స్తుతింతుము

## ఎనుబది మూడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-ఇంద్రావరుణులు, చందస్సు-జగతి

1 నేతలగు మిత్రావరుణులారా ! యజమానులు మీ సఖ్యత చూచినారు తమకు గోప్రాప్తి కలుగుటకు కొడవలిచేతబట్టి తూర్పుదిక్కునుసాగినారు మీరు దాసులను, సుదాస శత్రువులైన ఆర్యులను వధించండి సుదాసునకు రక్షణ కల్పించుటకు విచ్చేయండి

2 మానవులు ధ్వజములెత్తి యుద్ధమునకు కలిసినచోట యుద్ధమున ఏ మాత్రము అనుకూలించనప్పుడు ప్రాణులు స్వర్గముచేరునప్పుడు అదిగో అట్టి యుద్ధమున ఇంద్రావరుణులారా! మా పక్షము వహించండి

3 ఇంద్రావరుణులారా ! విపత్తు విరుచుకుపడినది భూమిమీది అన్నములన్నింటిని సైనికులు నష్టపరచినట్లున్నారు సైనికుల కోలాహలము స్వర్గమునంటుచున్నది నా సేనల శత్రువులందరు నన్ను సమీపించినారు హనన శ్రవణకారి ఇంద్రావరుణులారా! రక్షణలు వెంటబెట్టుకొని మావద్దకు విచ్చేయండి

4 ఇంద్రావరుణులారా ! ఆయుధమునకు అందని భేదనామక శత్రువును వధించినారు సుదారాజును రక్షించినారు తృత్సుల స్తోత్రములను విన్నారు యుద్ధకాలమున తృత్సుల పౌరోహిత్యమును ఫలింప చేసినారు

5 ఇంద్రావరుణులారా ! శత్రువులు ఆయుధ సహితులై నన్ను చుట్టుముట్టినారు హింసకుల నడుమ శత్రువులు నన్నుహింసించుచున్నారు మీరు ఉభయ ధనములకు అధిపతులు కావున యుద్ధమున మీరిద్దరు మమ్ము రక్షించండి

6 ఇంద్రావరుణులారా ! యుద్ధ సమయమున ఉభయులు సుదాస తృత్సులు-ధనప్రాప్తికిగాను మిమ్ము పిలుస్తారు ఈ యుద్ధమున పదిమంది రాజులతో పీడింపబడిన సుదాసుని తృత్సుల సహితముగా మీరు రక్షించినారు

7 ఇంద్రావరుణులారా ! యజ్ఞహీనులగు పదిమంది రాజులు ఏకమైనారు అయినను సుదాసుని

దెబ్బకొట్టలేక పోయినారు హవ్యయుక్త యజ్ఞమున నేతల స్తోత్రములు ఫలించినవి ఈ యజ్ఞమున సమస్త దేవతలు అవతరించినారు

8. తృత్సులు వసిష్ఠశిష్యులు వారు నిర్మలులు జటీవంతులు కర్మదులు వారు ఏ దేశమున స్తుతులతో సేవించినారో, ఆ దేశముననే పదిమంది రాజులు చుట్టుముట్టిన సుదాసునకు మిత్రావరుణు లారా ! మీరు బలము ప్రసాదించినారు

9 ఇంద్రావరుణులారా! మీలో ఒకరు ఇంద్రుడు వృత్రులనునాశము చేయును మరొకరు వ్రతములు కర్మలను రక్షించును అందమైన స్తుతులో పిలచెదము మాకు సుఖములు ప్రసాదించండి *"శర్మం యచ్ఛతమ్"*

10 ఇంద్ర, వరుణ, ఆర్యమలు మాకు ప్రకాశవంతమగు ధనమును మహా విస్తీర్ణ గృహమును ప్రసాదించవలెను యజ్ఞవర్థక అదితి తేజము మమ్ము బాధించరాదు మేము సవిత్ృ దేవుని స్తుతింతుము

## ఎనుబది నాలుగవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-ఇంద్రావరుణులు, చందస్సు-త్రిష్టుప్.

1 ఇంద్రావరుణులారా ! మీరు సామ్రాట్టులు నేను ఈ యజ్ఞమునుకు మిమ్ము హవ్యము, స్తోత్రములతో ఆహ్వానించుచున్నాను చేతులందు గల నానారూపముల జుహువులు స్వయముగామీవైపే చూచుచున్నవి

2 ఇంద్రావరుణులారా ! మీది స్వర్గరూపము విశాల దేశము మీరు వర్షము కలిగింతురు హర్షము కలిగింతురు పాశము లేకుండనే బాధించు ఉపాయములతో పాపిని బిగించండి వరుణుని క్రోధము మమ్ము రక్షించి దాటవలెను ఇంద్రుడు స్థానమును విస్తరించవలెను

3 ఇంద్రావరుణులారా ! మా గృహమందలి యజ్ఞమును రమణీయము చేయండి స్తోతల స్తోత్రములు ఉత్తమములు చేయండి దేవతలంపిన ధనము మమ్ము చేరవలెను అభిలషణీయ రక్షణలతో మమ్ము వర్థిల్లచేయండి

4 ఇంద్రావరుణులారా! అందరు కోరుకొను నివాస స్థానమును అన్నవంత ధనమును అందించండి ఆదిత్యుడు వరుణుడు అసత్యమును నాశనము చేయువాడు అతడే వీరులకు అపరిమిత ధనము ఇచ్చును

5 ఇది నా స్తుతి ఇది ఇంద్రుని, వరుణుని వ్యాప్తము చేయవలెను నేను ఉచ్చరించు ఈ స్తుతి పుత్రపౌత్రాదులను ఇవ్వవలెను రక్షించవలెను మేము సుందర రత్నవంతులమై యజ్ఞమును అందుకొందుము

## ఎనుబది ఐదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-ఇంద్రావరుణులు, చందస్సు-త్రిష్టుప్.

1 ఇంద్రావరుణులారా ! మీ కొఱకు సోమమును అగ్నికి ఆహుతి ఇచ్చుచున్నాను దీప్తవతి ఉషవలె దీప్తాంకము, రాక్షస శూన్యమగు స్తుతి రచించుచున్నాను యుద్ధము సంభవించినప్పుడు మీరు ప్రయాణము చేయుచు మమ్ము రక్షించండి

2 పరస్పర స్పర్థగల యుద్ధమున శత్రువు మాతో స్పర్థించును యుద్ధములందు ధ్వజముమీద ఆయుధములుపడును అట్టి తరి మిత్రావరుణులారా ! మీ ఆయుధములతో వివిధ గతులుగల శత్రువును నాశము చేయండి

3 సోమములన్నియు స్వాయత్త యశోవంతములు ద్యుతిమంతములు అవి గృహములందు ఇంద్రావరుణులకొరకు నిలుచును వారిలో వరుణుడు ప్రజాగణములను వేరువేరుగా పాలించును ఇంద్రుడు ఇతరులు గెలువరాని శత్రువును నాశము చేయును

4 అదితి పుత్రులారా ! మీరు బలశాలురు మీకు నమస్కరించి మిమ్ము సేవించువాడే శోభన కర్మవంతుడు, యజ్ఞజ్ఞాత అగును ఏ హవ్యవంతుడు మిమ్ము తృప్తులను చేయుటకు ఆహ్వానించునో వాడు అన్నవంతుడగును అందవలసిన ఫలమును అందుకొనును

5 ఇది నా స్తుతి ఇది ఇంద్రుని వరుణుని వ్యాప్తము చేయవలెను నేను ఉచ్చరించు ఈ స్తుతి పుత్ర, పౌత్రాదులను ఇవ్వవలెను రక్షించవలెను మేము సుందర రత్నవంతులమై యజ్ఞమును అందుకుందుము

## ఎనుబది ఆరవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-వరుణుడు, చందస్సు-త్రిష్టుప్

1 వరుణుని జన్మ ధీరము స్థిరము మహిమాన్వితము అతడు విశాల ద్యావాపృథ్వులను స్థాపించి నిలిపినాడు అతడు ఆకాశమున సూర్యుని, దర్శనీయ నక్షములను ద్విధా కల్పించినాడు అతడు భూమిని విస్తరింపచేసినాడు

(పగలు సూర్యుని, రాత్రి నక్షత్రములను కల్పించినందున "ద్వితా ద్విధా" అయినది)

2 వరుణుని దర్శించుటకు ఆతురుడైన ఋషి అనుచున్నాడు నేను ఈ దేహముండగా వరుణునితో ఉండగలనా? వరుణుని వద్ద ఎప్పుడు నిలువగలను? వరుణుడు క్రోధరహితుడై నా హవ్యము స్వీకరించగలడా? నేను సుమనస్కుడనై ఎన్నడు వరుణుని దర్శించగలను?

(ఉండుట నిలుచుట హవ్యస్వీకారము కనీస దర్శనము అవరోహణక్రమము ఆదర్శము నుండి వాస్తవమునకు)

3 వరుణా ! నిన్ను చూడదలచినాను ఒక పాపపుమాట అడగదలచినాను నేను అనేక ప్రశ్నలతో విద్వాంసులను దర్శించినాను వారందరు ముక్తకంఠమున వరుణుడు *"నీ విషయమున కోపము వహించినాడు"* అన్నారు

(వరుణుని వినా జ్ఞానము కలుగదని భావము కోపము విడిచి ఉపదేశించుమని ప్రార్థన)

4 వరుణా ! నేను చేసిన అపరాధమేమి? ఎందుకు స్తోత అగు మా మిత్రుని కొట్ట దలిచినావు? వరుణా ! నీ తేజస్సు దుర్ధర్షము నీవు ఏల పలుకవు? నీవు పలికిన నేను త్వరపడి, నమస్కరించి, ప్రాయశ్చిత్తము చేసికొని నీవద్దకు వత్తునుకదా !

5 వరుణా ! మమ్ము పితృక్రమాగత ద్రోహమునుండి విడిపించుము మా జీవిత కాలమున మేము చేసినదానినుండి విడిపించుము దొంగ పశువును దొంగిలించును అందుకు ప్రాయశ్చిత్తముగా దానికి గడ్డి మేపును ఆ దొంగనువలెను పలుపుకట్టిన దూడవలెను నన్ను వసిష్ఠుని విడిపించుము

(వసిష్టుని పూర్వులు ద్రోహము చేసినారనికాదు ఆతురతలలో అతడు అన్నింటినుంచి విముక్తుని చేయమని ప్రార్థించినాడు)

## పాపమును వివరించుచున్నాడు

6 వరుణా ! పాపము మానవ దోషమున కలుగదు అది సుర, భ్రమ, క్రోధము, జూదము, అజ్ఞానము మున్నగు దైవగతి కారణముగ జరుగును చిన్నవానిని పెద్దవాడు తప్పుదారి పట్టించును స్వప్నమందును దైవగతిలో పాపము కలుగును

7 వరుణుడు కామవర్షి పాలకుడు నేను పాపశూన్యుడనగుదును దాసునివలె వరుణుని అతడుకోరినరీతి పూజింతును మేము అజ్ఞానులము వరుణస్వామి మాకు జ్ఞానము ప్రసాదించవలెను, జ్ఞానివరుణుడు స్తోతకు ధన విషయక ప్రేరణ కలిగించవలెను

8 అన్నవంతవరుణా ! ఈ సూక్తరూప స్తోత్రము నీ కొఱకు రచించినాను దీనిని నీవు హృదయమున పదిలపరుచుకొనుము మాకు లాభము మంగళమయము కావలెను క్షేమము మంగళమయము కావలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## ఆలోచనామృతము

ఈ సూక్తము పాపము జ్ఞానమును గురించి చెప్పబడినది అతడు వసిష్ఠుడే కావచ్చును వేరెవ్వరయిన కావచ్చును పాపములనుండి విముక్తికి తపించినాడు మొరపెట్టుకున్నాడు ప్రార్థించినాడు అర్థించినాడు తుదకు పాపము తన దోషము కాదని తేల్చిచెప్పినాడు

ఇందలి ఆరవ మంత్రమును పరిశీలించవలసి ఉన్నది

*నసస్వోదక్షో వరుణధృతిః సాసురా మన్యుర్వీభీదకో అచిత్తః*
*అస్తిజ్యాయాన్కనీయః ఉపారేస్వప్నే దన్నృతస్య ప్రయోతా।*

పాపము మానవ దోషముకాదు అనుచుచన్నాడు అది అతని అధీనములేదు అనుచు స్వప్నపు ఉదాహరణ ఇచ్చినాడు స్వప్నము మానవుని అధీనమునలేదుకదా! అది పాపమేల కావలెను అని ప్రశ్న?

*"నసో దక్షో"* పురుష బలము పాపవృత్తికి కారణముకాదు *కాకున్న ఎవరు కారణము?* *"ధృతిః"* కాలము దైవగతి కారణములు అదెట్లనగా

సుర, భ్రమ, క్రోధము, జూదము, అజ్ఞానము పాపమునకు కారణములు ఇది నిత్య సత్యము నిశ్చితము ఈ దుర్గుణము దైవకృతములగునా?

మనిషి స్వాధీనమున లేనిదానిని దైవ కృతము అందుము కామక్రోధాది అరిషడ్వర్గములను మానవుడు తన అధీనము ఉంచుకొనవలెనని అనంతరకాలమున గీతాకారుడగు కృష్ణపరమాత్మ ప్రబోధించినాడు అది ఆదర్శము అసాధ్యముకాదు కాని దుస్సాధ్యము అందరకు సాధ్యమనగునదికాదు

కావున తాను చేసిన పనికి దైవమును బాధ్యుని చేయుట సమంజసమగునా? కాకపోవచ్చును కాని ఒక్కొక్కసారి తన పరిధిని దాటిపోయినపుడు దైవ కృతములు కావచ్చును

రామాయణమున రాముని *"విగ్రహవాన్ధర్మం"* అన్నాడు అతడు ధర్మస్వరూపుడని అర్థము అరణ్యమున సీత మాయలేడిని కోరినది అది ఆమె భ్రమ ఆభ్రమ రామునకు ఉండరాదు పైగా లక్ష్మణుడు హెచ్చరించినాడు అతడు మారీచుడు మాయలేడికాదని అయినను రాముడు మాయలేడిని వెన్నాడినాడు ఫలితము అనుభవించినాడు

ఇది దైవ కృతముకాదా? మానవుడు నివారించగలడా?

మహాభారతమున ధర్మరాజు ధర్మస్వరూపుడు అతనికి జూదము పాపమని తెలియదా? విదురాదులు వివరింపలేదా? మిన్నకున్నాడా? ఆడినాడు ఓడినాడు తొలి జూదమున ద్రౌపది అతనికి రాజ్యము ఇప్పించినది మరల జూదమునకు పిలిచిన ఊరకున్నాడా? ఓడినాడు అడవుల పాలయినాడు

ఇది దైవకృతముకాదా? మానవుడు నివారించగలడా?

ఈ మధ్య జరిగిన రెండు ప్రపంచ సంగ్రామములు ఎవరుకోరి తెచ్చుకున్నారు

ఆధునిక నాగరకతపేర సాగుతున్న అణ్వాధ్యాయుధములు మానవ వినాశకారకమగు కాలుష్యాదులు ఎవరుకోరి తెచ్చుకొనుచున్నారు? ఎవరు మానవజాతి ఆత్మహత్యకు కారణమగుచున్నారు?

ఇది దైవ కృతముకాదా? మానవుడు నివారించగలడా?

అట్లని వ్యక్తిని బాధ్యతా రహితుని చేయలేము అతని పనులకు అతడే ఇహపరములందు బాధ్యత వహించవలసి ఉన్నది స్వప్రయత్నమునకు మీరి, అలవికానప్పుడు మాత్రమే దైవకృతమగును

స్వప్నమున చేసినది పాపమగునా? ఇది వాదనకు బాగున్నది తెలిసి చేసినది మాత్రమే పాపము, దోషము నేరము అగుచున్నది

## ఎనుబది ఏడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-వరుణుడు, చందస్సు-త్రిష్టుప్

1 వరుణుడు అంతరిక్షమున సూర్యునికొఱకు మార్గము ఏర్పరచినాడు. నదులకు అంతరిక్షమును పుట్టిన జలము అందించినాడు మగ గుర్రములు ఆడగుర్రముకొరకు ఉరికినట్లు వరుణుడు వేగముగా పోదలచి రాత్రులనుండిపగళ్లను వేరుచేసినాడు

2 వరుణా ! నీగాలి లోకములకు ప్రాణము నలువైపుల ఉన్న నీరు కూడ నీవు ఇచ్చినదే గ్రాసము పశువును అన్నవంతముచేయును అట్లే జగములను, భరించు వాయువు అన్నవంతుడగను గొప్పవి, పెద్దవి అగు ద్యావాపృథ్వులమధ్య ఉన్న నీ సమస్త స్థానములు జనప్రియములు

3 వరుణుని అనుచర వర్గమంతయు ప్రశంసనీయము వారు చక్కని రూపము గలవారు ద్యావాపృథ్వులను వీక్షింతురు వారు కర్మవంతులు, యజ్ఞధీరులయిన కవుల స్తోత్రములను నలువైపులనుండి వీక్షింతురు

4 నేను మేధావి ఋత్విక్కును పృథ్విలేక వాక్కునకు ఇరువది ఒక్క పేర్లున్నవని వరుణుడు నాతో చెప్పినాడు వరుణుడు మేధావి విద్వాంసుడు అతడు యోగ్యుడగు శిష్యునకు ఉత్తమ స్థానమునందు ఈ రహస్యములను అన్నింటిని ఉపదేశించినాడు

5 ఈ వరుణునిలో ఉత్తమ, మధ్యమ, అధమ మూడు విధముల ద్యులోకములు ఉన్నవి ఇతనిలో ఉత్తమ, మధ్యమ, అధమ భూములు ఋతువులనుబట్టి ఆరు దశలు ఉన్నవి రాజావరుణుడు బంగారు ఊయలవంటి సూర్యుని వెలుగుకొఱకు ఏర్పరచినారు

6 వరుణుడు సూర్యునివంటి వెలుగు కలవాడు అతడు సముద్రములను స్థాపించినాడు వరుణుడు జలబిందువు వంటి నిర్మలుడు గౌరమృగము వంటి బలవంతుడు గంభీరస్తోత్రమువంటి జలముల నిర్మాత దుఃఖములను దాటగల బలవంతుడు లోకములందలి సమస్త పదార్థములకును రాజు

7 వరుణుడు అపరాధిని సహితము అనుగ్రహించును దీనత్వము ఎరుగని వరుణుని కార్యములను మేము యదావిధిగా సమృద్ధము చేయుదుము అతనిముందు నిరపరాధులమై నిలుతుము *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

## ఎనుబది ఎనిమిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు దేవత-వరుణుడు, చందస్సు-త్రిష్టుప్

1 వసిష్ఠా ! కోటికలు తీర్చు వరుణుని గూర్చి స్వయంశుద్ధము, ప్రియతమమగు స్తుతి రచింపుము వరుణుడు యజనీయుడు బహుధనవంతుడు అభీష్టవర్షి విశాలుడు వరుణుడు సూర్యుని మనకు అభిముఖుని చేయును

2 ఇప్పుడు వెంటనే నేను వరుణుని దర్శనముచేసి కొందును అగ్ని జ్వాలలను స్తుతింతును వరుణుడు పాషాణమునందలి సుఖకర సోమమును తనివి తీరసేవించినప్పుడు అప్పుడు అతడు ప్రశస్తరూపమున దర్శనమిచ్చును

3 నేను వరుణుడు నావపై ఎక్కినపుడు నావను సముద్ర మధ్యమున నడిపినపుడు నీటిమీద తేలియాడు నావపై మేమున్నపుడు అప్పుడు నావరూపపు ఊయలలో ఊగుచు ఆనందముగ ఆటలాడినాము

4 మేధావి వరుణుడు సూర్యాత్మరూపమున రాత్రింబవళ్లను పెంపొందించినాడు దినములలో సుదినమున వసిష్ఠుని నావమీద ఎక్కించినాడు వరుణుడు తన రక్షణలతో వసిష్ఠుని సుకర్మను చేసినాడు

5 వరుణా ! మనకు పురాతన స్నేహము ఎచట ఏర్పడినది? పూర్వము మనకు హింసారహిత మైత్రి ఏర్పడినది దానినే నిలుపుకొనుచున్నాము అన్నవంత వరుణా ! గొప్పది, ప్రాణులకు విడదీయునది, వేయిద్వారములుగల నీ గృహమున నేను ప్రవేశింతును

6 వరుణా ! వసిష్ఠుడు నీకు నిత్యబంధువు ఔరసపుత్రుడు అతడు పూర్వము ప్రియుడయి నీ విషయమును అపరాధము చేసినాడు అతడు ఇప్పుడు నీకు మిత్రుడు కావలెను

యజనీయ వరుణా ! మేము నీకు ఆత్మీయులము కావున పాపయుక్తులమై భోగములు అనుభవించకుండరాదు నీవు మేధావివి స్తోతలకు కోటిన గృహము ప్రదానము చేయుము

7 వరుణా ! మేమందరము నిత్యములగు భూములందు నివసింతుము నిన్నుస్తుతింతుము నీవు మాకట్లు విప్పవలెను మేము అఖండభూతలము నుండి వరుణుని రక్షణలు అనుభవించవలెను *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## ఎనుబది తొమ్మిదవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు దేవత-వరుణుడు, చందస్సు-గాయత్రి, చివరిది జగతి

1 రాజా ! వరుణా ! నీ మట్టి ఇల్లునాకు వద్దు బంగారపుది కావలెనని అర్థము శోభన ధనవంత వరుణా ! అనుగ్రహించుము మమ్మ సుఖింప చేయుము, *"మృళాసుక్షత్ర మృళయ"*

2 ఆయుధములుగల వరుణా ! నేను వడకుచు గాలితోలిన మబ్బువలె సాగుదును *"మృళాసుక్షత్రమృళయ"*

3 ధనవంతుడు, నిర్మలుడవగు వరుణా ! దీనత, అసమర్థతవలన శ్రౌత, స్మార్తాదికర్మానుష్ఠానములకు ప్రతికూలుడనైనాను *"మృళా సుక్షత్ర మృళయ"*

4 నేను స్తోతను సముద్రమున ఉన్నాను అయినను దాహమగుచున్నది *"మృళా సుక్షత్ర మృళయ"*

5 వరుణా ! మేము మానవులము దేవతల విషయమున అపకారము చేసి ఉండవచ్చును అజ్ఞానము వలన చేయవలసిన కర్మలందు ప్రమత్తులము కావచ్చును అట్టి అపరాధములను ఎంచి మమ్మ కొట్టకుము

(ఆంధ్ర వచన ఋగ్వేద సంహిత ఏడవ మండలము ఐదవ అష్టకమున అయిదవ అనువాకము సమాప్తము )

## ఆరవ అనువాకము

## తొంబదవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-వాయువు, ఛందస్సు-త్రిష్టుప్

1 వాయువా ! నీవు వీరుడవు శుద్ధము, మధురము అభిషుత సోమమును అధ్వర్యులు నీకు అందింతురు నీవు నియుత్ గణములను అశ్వములను రథమునకు జోడించుము విచ్చేయుము ఆనందమునకు అభిషుత సోమభాగమును ఆరగింపుము

2 వాయువా ! నీవే ఈశ్వరుడవు నీకు ఉత్తమ ఆహుతి ఇచ్చిన యజమానివి పవిత్ర సోమము సమర్పించిన వానిని మానవులందు ప్రధానుని చేయుము అతడు సర్వత్ర ప్రఖ్యాతుడగును అందవలసిన ధనమును అందుకొనును

3 ద్యావాపృథ్వులు ధనముకొఱకు ఈ వాయువును సృష్టించినవి ప్రకాశమానమగు స్తుతి-ధనముకొఱకు ఈ వాయువును ధరించినది అట్టి వాయువును ఇప్పుడు అశ్వములు సేవించుచున్నవి

4 పాపశూన్యలగు ఉషస్సులు సుదినములకు కారణభూతులగుటకు అంధకారమును నశింప చేసినారు దీప్యమానులై విస్తీర్ణజ్యోతిని అందుకున్నవి అంగిరులు గోరూపధనమును పొందినారు ప్రాచీన జలములు అంగిరులను అనుసరించినవి

5 ఇంద్రవాయువులారా ! యజమానులు సుమనస్కులై మననీయ స్తోత్రములతో వెలుగొందుదురు వారివారి కర్మలు వీరకృత్యములతో రథములు సాధింతురు ఆరథములపై మిమ్ము ఆసీనులను చేయుదురు మీరు ఈశ్వరులు సమస్త అన్నములు మిమ్ము సేవించును

6 ఇంద్రవాయువులారా ! మాకు గోవులు, అశ్వములు, గృహములు, బంగారములతో సుఖింప జేయునట్టి క్షమతాశీలదాతలు యుద్ధమున అశ్వములు, వీరుల సాయమున సుదీర్ఘ జీవనమును గెలుచుకొందురు

(జీవనము యుద్ధరంగమని దానిని గెలుచుటకు దానము కారణమని చెప్పినాడు)

7 అశ్వమువంటి హవివాహకులు, అన్నమును ప్రార్థించువారు, బలమును కోరువారగు వసిష్ఠగణములు ఉత్తమ స్తుతులతో ఇంద్రవాయువులను ఆహ్వానింతురు *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

## తొంబది ఒకటవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-వాయువు, ఛందస్సు-త్రిష్టుప్

1 ప్రాచీన కాలమున ప్రవృద్ధులైన స్తోతలు వాయువునకు అనేక స్తోత్రములు వచించినారు ప్రశస్తులయినారు వారు ఆపదలందున్న మానవులను తరింపచేయుటకు వాయువునకు హవి అర్పించుటకుగాను సూర్యునితో ఉషను ఒకేచోట నిలిపినారు

2 ఇంద్రవాయువులారా ! మీరు కామాయమానదూతలు రక్షకులు మీరు బాధించవలదు నెలలు, ఏండ్ల పర్యంతము కాపాడవలెను మా సుందర స్తుతి మిమ్ము చేరి సుఖప్రదము, ప్రశంసనీయము, సులభ్యమగు ధనమును యాచించును

3 వాయువు - మంచి బుద్ధిగలవాడు తన గుఱ్ఱముల కొఱకు తెలుపును ఎన్నుకున్నవాడు అతడు ప్రచుర అన్నవంతులు, ధనవృద్ధిగలవారిని ఆశ్రయించును వారు సహితము మంచి మనసుగలవారై, వాయువుకొఱకు యజ్ఞము చేయుటకు వివిధ రీతుల చేరినారు వారు సుందర సంతతికి కారణభూతములగు కార్యములను చేసినారు

4 మీ దేహమున వేగము ఉన్నంతవరకు బలము ఉన్నంతవరకు నేతలు జ్ఞానబలమున ప్రకాశమానులయినంతవరకు - అప్పటివరకు విశుద్ధ సోమపానము చేయు ఇంద్రావరుణులారా ! ఈ కుశలపై ఆసీనులుకండి విశుద్ధ సోమపానము చేయండి

5 ఇంద్రవాయువులారా ! మీరు కోఱదగిన స్తోత్రములుగలవారు మీ అశ్వములను ఒకే రథమున పూన్చండి మా వద్దకు విచ్చేయండి ఈ సోమమునందలి అగ్రభాగము మీ కొఱకు తెచ్చినాము సోమము సేవించుడు ప్రసన్నులగుడు మమ్ము పాపములనుంచి విడిపించుడు

6 ఇంద్రవాయువులారా ! మీ అశ్వములు శత సంఖ్యాకములు అవి మిమ్ము సేవించును అందరిని ఆకర్షించు అశ్వములు శత సంఖ్యాకములు అవియు మిమ్ము సేవించును శోభన ధనములు ఇచ్చువట్టి ఆ అశ్వములతో మావద్దకు విచ్చేయండి

7 అశ్వమువంటి హవివాహకులు, అన్నమును ప్రార్థించువారు, బలమును కోరువారును వసిష్ఠగణములు ఉత్తమ స్తుతులతో ఇంద్రవాయువులను ఆహ్వానింతురు *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## తొంబది రెండవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-వాయువు, ఛందస్సు-త్రిష్టుప్

1 వాయువా ! నీవు పవిత్ర సోమము అందుకొనువాడవు మావద్దకు విచ్చేయుము నిన్ను అందఱు అభిలషింతురు నీకు వేయి గుఱ్ఱములున్నవి నీవు ప్రథమ సోమమునకు అధికారివి అట్టి మాదకమగు సోమమే నీ కొఱకు పాత్రలో ఉన్నది

2 క్షిప్రకారులు, సోమమును అభిషవించు అధ్వర్యులు ఇంద్రవాయువుల కొఱకు యజ్ఞమున సోమము ఏర్పరచినారు ఇంద్రవాయువులారా ! దేవాభిలాషుగువారు అధ్వర్యులు కర్మద్వారా మీకొఱకు ఈ యజ్ఞమున సోమపు అగ్రభాగము అర్పించినారు

3 వాయువా ! గృహమునందున్న హవ్యదాత వద్దకు యజ్ఞమునకు ఏ అశ్వములతో ఏగుదువో వానితోనే విచ్చేయుము మాకు అన్నవంత ధనము, వీరపుత్రులు, గోవులు అశ్వములతో కూడిన వైభవము ఇమ్ము

4 ఇంద్రవాయువులను తృప్తులను చేయు స్తోతలు దేవయుక్తులు అందువలన వారు శత్రునాశకులు వారిసాయమున మేము శత్రునాశము చేయు సమర్థులము అగుదుము ఆ స్తోతల సహితులమై మేము శత్రువును పరాభవించగలము

5 వాయువా ! శతసంఖ్యాక, సహస్రసంఖ్యాకములగు నీ అశ్వములతో హింసాశూన్యమగు మా

యజ్ఞమువద్దకు విచ్చేయుము ఈ యజ్ఞమున సోమపానము చేయుము ఉన్మత్తుడవగుము *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## తొంబది మూడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఇంద్రాగ్నులు, ఛందస్సు-త్రిష్టుప్.

1 వృత్రఘ్న ఇంద్రా! అగ్నీ ! ఈనాటి నాస్తోత్రము పరిశుద్ధము నవోత్పన్నము దీనిని మీరు స్వీకరించండి మీరు సుఖముగ పిలువ తగినవారు నేను మిమ్ము మరల మరల పిలుస్తాను యజమాని మిమ్ము అభిలషించును అతనికి వెంటనే అన్నము ప్రదానము చేయండి

2 ఇంద్రాగ్నులారా ! మీరు విధిపూర్వకముగ పూజనీయులు మీరు బలిభూతము వంటి శత్రుభంజకులుకండి మీరు ఒకేసారి పెంపొందువారు విశేష ధనవంతులు అన్నములకు ఈశ్వరులు మీరు దృఢమును శత్రువినాశకమగు అన్నము మాకు ప్రసాదించండి

3 హవివంతులు, కృపాభిలాషులగు విప్రులు అనుష్ఠానముతో యజ్ఞలబ్ధి పొందుదురు, అట్టి నేతలగు జనులు అశ్వము యుద్ధభూమిని వ్యాప్తము చేసినట్లు ఇంద్రావరుణుల కర్మములకు వ్యాప్తికలిగింతురు వారిని మాటిమాటికి పిలుతురు

4 ఇంద్రాగ్నులారా ! విప్రులు మీ కృపార్థులు యశోవంతులు తొలుత అనుభవించదగిన ధనముకొఱకు స్తోత్రములతో మిమ్ము స్తుతిస్తారు నూతనము, దానయోగ్యమగు ధనముతో మమ్ము వర్థిల్లచేయండి

5 విశాలములు, పరస్పర యుద్ధము చేయునవి, యుద్ధమందు ప్రయత్నశీలములగు ఉభయ సేనలను మీ తేజస్సుతో ఎల్లప్పుడు నష్ట పరుస్తుండండి సోమాభిషవకర్త, దేవాభిలాషి యజమాని సాయమున దేవాభిలాష లేనివారిని నాశముచేయండి

6 ఇంద్రావరుణులారా ! మంచి మనసునకుగాను మీరు మా సోమాభిషవ కర్మకు విచ్చేయండి మీరు మమ్ముగాక ఇతరులను ఎరుగరు అందువలన చాల అన్నముతో మిమ్ము ఆహ్వానించుచున్నాము

7 అగ్నీ ! నీకు ఈ అన్నమున సమిద్ధుడవగుము ఇంద్రుడు, మిత్రుడు, వరుణునకు ఇది రక్షణీయమని చెప్పుము మేము చేసిన అపరాధములనుండి మమ్ము రక్షింపుము ఆర్యమ, అదితి సహితము అట్టి మా అపరాధమును తొలగించవలెను

8 అగ్నీ ! శీఘ్రముగ ఈ యజ్ఞమును ఆశ్రయింపుము మా అందరకు ఒకేసారి నీ అన్నము లభించవలెను ఇంద్ర, విష్ణు, మరుద్గణములు మమ్ముకాక ఇతరులను చూడరాదు *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

## తొంబది నాలుగవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఇంద్రాగ్నులు, ఛందస్సు-జగతి, చివరిది అనుష్టుప్

1 ఇంద్రాగ్నులారా! మేఘము నుండి వర్షమగునకదా, అట్లే ఈ స్తోతనుండి ప్రధానమగు స్తుతి కలిగినది

2 ఇంద్రాగ్నులారా! మీరు ఈశ్వరులు స్తోత పిలుపు వినండి అతని స్తుతిని భోగించండి. అనుష్ఠిత కర్మను పూర్తిచేయండి

3 నేతలగు ఇంద్రాగ్నులారా! మమ్ము హీనభావము, పరాభవము అను నిందలలోనికి త్రోయకండి

4 రక్షణలు కోరిన మేము విశిష్ఠహవ్యము, సుందర స్తుతి, కర్మయుక్త వచనములను ఇంద్రాగ్నులవద్దకు పంపుదుము

5 రక్షణల కొఱకు విప్రులు ఇంద్రాగ్నులను స్తుతింతురు బాధలందు ఉన్నవారుకూడ అన్నప్రాప్త కొఱకు స్తుతింతురు

6 మేము స్తోత్రాభిమానులము అన్నవంతులము ధనాభిలాషులము యజ్ఞప్రాప్తికొఱకు మిమ్ము స్తుతింతుము ఆహ్వానింతుము

7 ఇంద్రాగ్నులారా! మీరు మానవులను సృష్టించువారు మావద్దకు మీరు అన్నసహితులైరండి కఠినవాక్కులాడువాడు మాకు ప్రభువుకారాదు

8 ఇంద్రాగ్నులారా! మాకు ఎటువంటి శత్రువుయొక్క హింస కలుగరాదు మాకు సుఖములను ఇవ్వండి

9 ఇంద్రాగ్నులారా! మీవద్ద గోవులు, అశ్వములు, హిరణ్యయుక్త ధనమున్నది మేము దానిని యాచించుచున్నాము అది మా అనుభవమునకు రావలెను

10 కర్మనేతలు సోమము అభిషవింతురు సేవాభిలాషులు అగుదురు అశ్వములుగల ఇంద్రుని అగ్నిని తేప తేప పిలిచెదరు

11 అందరిని మించిన వృత్రహంత, ఆనందమగ్నుడు ఇంద్రుని, అగ్నిని మేము ఉక్థము స్తోత్రము, అన్నస్తవములతో సేవింతుము

12 ఇంద్రాగ్నులారా! దురాలోచనపరులను దుష్టజ్ఞానవంతులను, దుష్టబలవంతులను చోరులను కుండలనుబ్రద్దలు కొట్టినట్లు కొట్టండి

## తొంబది ఐదవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-సరస్వతి, ఛందస్సు-త్రిష్టుప్.

1 సరస్వతి లోహనిర్మిత పురివలె ధారయిత్రి అగును ఆమె జీవనధారక జలముతో ప్రవహించును ఆమె తన మహిమతో సారథివలె ఇతర నదులను బాధించుచుసాగును

2 ఒకే సరస్వతి నదులలో పవిత్ర పర్వమునుండి సాగరమువరకు సాగునది ఆమె నహుషుని ప్రార్థన విన్నది నహుషునకు ఎంతో ధనము ఇచ్చినది అతని కొఱకు ఘృత, దుగ్ధధారలు పారించినది

3 సరస్వతి మానవ శ్రేయస్సు కొఱకు వర్షము కలిగించు సమర్థురాలు ఆమె పుట్టుకతో శిశువు యజ్ఞములందు యోషిత జలముల మధ్య పెరిగినది ఆమె హవిష్మంత యజమానికి బలశాలి అగు పుత్రుని ఇచ్చును లాభము కలిగించి అనేకుల సంస్కరించును

4 సరస్వతి శోభన ధనములు కలది ఆమె ప్రసన్నురాలు కావలెను యజ్ఞమునకు రావలెను స్తుతులు వినవలెను పూజనీయులగు దేవతలు తలలువంచి ఆమె దగ్గరకు వెళ్లుదురు సరస్వతి నిత్యధనవంతురాలు తన సఖుల విషయమున దయామయి

5 దేవీ సరస్వతీ ! మేము ఈ హవ్యమును హవనము చేసి నమస్కరించి నీవద్దనుండి ధనము అందుకుందుము మా స్తుతిని స్వీకరించుము మేము నీకు అత్యంత ప్రియమగు గృహమున ఉందుము ఆశ్రయించిన వృక్షమువలె నీవద్దనే నిలుతుము

6 సుధన సరస్వతీ ! ఈ వసిష్ఠుడు యజ్ఞద్వారములు తెరుస్తాడు శుభ్రవర్ణదేవీ ! సాగుము స్తోతకు అన్నము అందించుము *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## తొంబది ఆరవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-సరస్వతి, ఛందస్సు-1,2 బృహతి, 3 ప్రస్తారపంక్తి, మిగిలినవి గాయత్రి

1 వసిష్ఠా ! సరస్వతి నదులలో బలవతి ఆమె కొఱకు బృహత్ స్తోత్రములు పాడుము ద్యావాపృథ్వులందు వర్తించు సరస్వతినే నిర్దోష స్తోత్రములతో పూజింపుము

2 శుభ్రవర్ణ సరస్వతీ ! నీ మహిమ వలననే మానవుడు దివ్య పార్థివ అన్నములను పొందుచున్నాడు నీవు మమ్ము గ్రహింపుము రక్షింపుము మరుత్తుల సఖివై హవిర్దాతలకు ధనమంపుము

3 శుభంకరీ సరస్వతీ ! నీవు శుభములు మాత్రమే సమకూర్చుము సుందర గమనవగుము అన్నవతిని అగుము మాకు ప్రజ్ఞ కలిగించుము నేను జమదగ్నివలె నిన్ను స్తుతించుచున్నాను నీవు వసిష్ఠ స్తూయమానవగుము

4 మేము స్త్రీలను పుత్రులను కోరుకొను దాతలము స్తోతలము మేము సరస్వతిని స్తుతించుచున్నాము

5 సరస్వాన్ ! నీవద్ద రసవంతములగు జలసమూహములు వర్షజలములు ఉన్నవి వానితో మమ్ము రక్షింపుము

6 ప్రవృద్ధ సరస్వతి స్తనమువంటి మధుధారలు మాకు అందవలెను ఆమె సర్వదర్శనీయ మేము ప్రజ్ఞయు అన్నమును పొందవలెను

## తొంబది ఏడవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-బ్రహ్మణస్పతి, బృహస్పతి, ఛందస్సు-త్రిష్టుప్

1 సేవాభిలాషినేతలు ఉన్మత్తులయిన యజ్ఞమున భూలోకనేతలు సమస్త సోమము ఇంద్రుని కొఱకు అభిషవించు యజ్ఞమున ఆ యజ్ఞమునకే హృష్టుడగుటకుగాను ఇంద్రుడు తొలుతరావలెను నడకలుగల అశ్వములుకూడ రావలెను

2 మిత్రులారా ! మేము దేవతల రక్షకుగాను ప్రార్థించుచున్నాము బృహస్పతి మా హవ్యములు స్వీకరించవలెను దూరదేశమునుండి ధనముతెచ్చి తండ్రికొడుకుకు ఇచ్చును అట్లే బృహస్పతి మాకు దానము చేయును కోరికలు తీర్చు బృహస్పతివద్ద మేము అపరాధులముకారాదు ఆరీతి చేయకుము

3 బ్రహ్మణస్పతి జ్యేష్ఠుడు సుందరుడు సుఖవంతుడు మేము అతనికి నమస్కరింతుము హవ్యములిత్తుము స్తుతింతుము దేవకృత మంత్రములకు ప్రభువగు ఇంద్రుని బ్రహ్మణస్పతిని శ్లోకములతో స్తుతించండి

4 ఈ ప్రియతమ బ్రహ్మణస్పతి మా ఈ వేదిమీద ఆసీనుడు కావలెను అతడు అందఱకు వరణీయుడు మేము ధనము శోభన వీర్యము కోరియున్నాము బ్రహ్మణస్పతి వానిని తీర్చవలెను మేము చిక్కులలో చిక్కుకున్నాము అతడు మమ్ము అహింసితుడయి దాటించవలెను

5 అమర దేవగణములు తొలుత ఆవిర్భవించినారు వారికి ఇష్టమైనదియు పూజాసాధనమగు అన్నము మాకు అందవలెను శుద్ధ స్తోత్రవంతుడు, గృహస్థుల యజ్ఞయోగ్యుడు, అప్రతిగత బృహస్పతిని మేము పిలుచుచున్నాము

6 సుఖకర, రుచికర, వహనశీల, జ్యోతిష్మంత అశ్వగణములు బృహస్పతిని వహించవలెను బృహస్పతికి బలము నివాసమునకు గృహము ఉన్నవి

7 బృహస్పతి పవిత్రుడు అతని వాహనములు అనేకములు అతడు అందరిని శోధించువాడు హితకరము, రమణీయమగు విద్యావంతుడు అతడు గమనశీలుడు స్వర్గభోక్త, దర్శనీయుడు ఉత్తమ నివాసవంతుడు అతడు స్తోతలకు అందరికన్న మిన్నగా అన్నము ఇచ్చును

8 బృహస్పతి జనని దేవి ద్యావాపృథ్వి తన మహిమల బలముతో బృహస్పతిని వర్ధిల్లచేయవలెను మిత్రులారా ! వర్ధనీయ బృహస్పతిని వర్ధిల్లచేయండి అతడు మరింత అన్నమునుకుగాను జలరాశిని సులభముగా దాటునట్లును సుఖముగ స్నానము చేయునట్లు చేయగలడు

9 బ్రహ్మణస్పతీ ! నీ కొఱకును వజ్రధారి ఇంద్రుని కొఱకును నేను మంత్రరూప సుందర స్తుతులు రచించినాను మీరిద్దరు మా అనుష్ఠానములను రక్షించండి అనేక స్తుతులు వినండి మేము మీ భక్తులము మమ్ము ఆక్రమించదలచిన శత్రుసేనను నష్టపరచండి

10 బృహస్పతీ ! నీవు, ఇంద్రుడు దివ్య, పార్థివ ఉభయ ధనములకు ప్రభువులు, అందుకే స్తోతలకు ధనము ఇచ్చెదరు *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## తొంబది ఎనిమిదవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-ఇంద్రుడు, ఛందస్సు-త్రిష్టుప్.

1 అధ్వర్యులారా ! ఇంద్రుడు మానవశ్రేష్ఠుడు అతని కొఱకు రుచికరమగు అభిషుత సోమపు హవనముచేయండి ఇంద్రుడు సోమము దూరముగా ఉన్నదని, అది పానయోగ్యమని తెలియును గౌరమృగము కన్న వేగముగా అభిషవము చేయు యజమానిని వెదకుచు మరల మరల వచ్చును

2 ఇంద్రా ! పూర్వకాలము నీవు శోభన సోమమును సేవించినావు ఇప్పుడు కూడ ప్రతినిత్యము అట్టి సోమమునే సేవించవలెననుకొనుము హృదయమునందును, మనమునను మమ్మే నిలిపి నీముందట సమర్పించిన సోమమును సేవించుము

3 ఇంద్రా ! నీవు పుట్టుకతోనే బలము కలుగుటకుగాను సోమపానము చేసినావు నీ తల్లి అదితి నీ మహిమలు తెలియపరచినది నీవు విస్తృత అంతరిక్షమును నీ తేజస్సుతోనింపినావు యుద్ధము చేసి దేవతలకొఱకు ధనము పుట్టించినావు

4 ఇంద్రా ! నీవు మాననీయులు, అభిమానధనులగు శత్రువుతో యుద్ధము చేయించినపుడు మేము బాహుబలమున వారిని పరాజితులను చేసెదము అట్లుకాక మరుత్తులతో కూడి నీవు స్వయముగా యుద్ధమున దిగినచో అన్నముకొఱకగు ఆ యుద్ధమున మేముగెలువగలము

(*"సాక్షామ జయేమ"* అను రెండు పదములు ప్రయోగించినాడు సాక్షామ అనగా సహించగలము ఓడించగలమని అర్థము, ఎదుటివారి ఓటమి మాత్రము తనజయముకాదు కావున జయేమ జయింతుము అన్నాడు)

5 నేను ఇంద్రుని పూర్వకర్మలను వక్కాణింతును అతని నవీన కర్మములున్నవి వానిని కూడ వివరింతును ఇంద్రుడు ఆసురీమాయను ఓడించినాడు కావున సోమము ఇంద్రునిది మాత్రమే అగును *"భవత్కేవలః సోమో అస్య"*

6 ఇంద్రా ! ప్రాణుల ఉనికికి నలుదిశల సమస్త విశ్వము నిలిచి ఉన్నది దానిని నీవు సూర్యతేజమున వీక్షింతువు అవన్నియు నీవే నీవు ఒక్కడవే సమస్త గోవులకు స్వామివి నీవు ఇచ్చిన ధనమునే మేము అనుభవింతుము

*"వయతస్యవస్వః"*

7 బృహస్పతీ ! నీవు, ఇంద్రుడు దివ్య, పార్థివ ఉభయ ధనములకు అధిపతులు మీరిద్దరు స్తోత్రకర్త స్తోతలకు ధనము ఇచ్చువారు *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## తొంబది తొమ్మిదవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-ఇంద్రుడు-విష్ణువు, ఛందస్సు-త్రిష్టుప్.

1 విష్ణూ ! నీవు శబ్దస్పర్శాది పంచతన్మాత్రలకు అతీతుడవై నీ దేహమును పెంచినావు ఆ నీ మహిమను ఎరుగువారులేరు మేము నీ ఉభయ పృథివ్యంతరిక్షలోకములను ఎరుగుదుము కాని నీవు మాత్రమే పరమలోకమును ఎరుగుదువు *"త్వం పరమస్య విత్సె"*

(విష్ణువు వామనుడై ముల్లోకములను వ్యాపించినాడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు పంచతన్మాత్రలు సృష్టి సాంతము ఈ అయిదింటిమీదనే ఆధారపడి ఉన్నది విష్ణువు వీనికి అతీతుడు)

2 విష్ణూ ! భూమిమీద పుట్టినవాడు కాని పుట్టబోవువాడు కాని నీ మహిమల పారమును అందజాలడు దర్శనీయము విశాలమగు ద్యులోకమును ఎత్తిపట్టినావు భూలోకపు తూర్పుదిశను ధరించి ఉన్నావు

(తూర్పు దిశను ధరించుట అనగా సూర్యుడగుట)

3 ద్యావాపృథ్వులారా ! మీరు స్తోతలగుమానవులకకు దానము చేయగోరి అన్నవంతులు, ధేనువంతులు యువతులు అయినారు

విష్ణువా ! నీవు వివిధ రీతుల ద్యావాపృథ్వులను క్రిందుమీదుగా నిలిపి ఉంచినావు అంతట ఉన్న పర్వతములతో పృథ్విని నిలిపి ఉంచినావు.

4 ఇంద్ర, విష్ణువులారా ! మీరు సూర్యుని, అగ్నిని, ఉషను సృష్టించినారు యజమాని కొఱకు విశాల స్వర్గమును నిర్మించినారు మీరు *"వృహిశ్రివ"* నామక దస్యుని యుద్ధమున నష్టపరచినారు

5 ఇంద్ర విష్ణువులారా ! మీరు శంబరుని తొంబది తొమ్మిది దృఢపురములను ధ్వంసముచేసినారు వర్చినామక అసురుని నూరుగురు, వేయిమంది వీరులను హతమార్చినారు

6 ఈ స్తుతి బృహత్, విస్తీర్ణ, విక్రమయుక్తము ఇది బలశాలురగు ఇంద్ర విష్ణువులను వర్థిల్లచేయును యజ్ఞ స్థలమున వారికి ఈ స్తోత్రము సమర్పించబడినది యుద్ధమున మీరు మా అన్నమును పెంచవలెను

7 విష్ణూ! యజ్ఞమున నీ కొఱకు నోటితో వషట్కారము చేసినాను తేజోవంత విష్ణూ ! నీవు ఈ హవ్యమును స్వీకరింపుము శోభనములగు మా స్తుతియు, వాక్కును నిన్ను వర్థిల్ల చేయునుగాత, *"యూయం పాత స్వస్తిభిః సదానః"*

## మూరవ సూక్తము

### ఋషి-వసిష్ఠుడు, దేవత-విష్ణువు, ఛందస్సు-త్రిష్టుప్

1 విష్ణువు బహుజన కీర్తనీయుడు విష్ణువునకు హవ్యప్రదానముచేయవాడును ముక్తకంఠమున మంత్రములతో అతనిని పూజించువాడును మానవ హితైషి విష్ణువును సేవించువాడును ధనముకోరి దానిని పొందును

2 కోరికలు తీర్చు విష్ణువా ! అందరికి హితకరమును, ద్వేషరహితమగు నీ అనుగ్రహమునకు మమ్ము పాత్రులను చేయుము అందువలన మాకు పొందదగిన అనేక అశ్వములుగల బహుజ్ఞాన ఆనందకర ధనము లభించును అదిలభించునట్లు చేయుము

3 ఈ విష్ణు దేవుడు నూర్ల కిరణములు కలిగి ఈ భూమిని తన మహిమతో మూడుసార్లు చరణములు అంటించినాడు ముల్లోకములను ఆక్రమించినాడు పెద్దలకన్న పెద్ద విష్ణువు మాకు స్వామి ప్రవృద్ధ విష్ణు రూపము ప్రదీప్తము

4 ఈ భూమిని మానవనివాస యోగ్యము చేయగోరి ఈ విష్ణువు భూమిమీద అడుగుపెట్టినాడు ఈ విష్ణువు స్తోతలు నిశ్చలులగుదురు సుజన్మ విష్ణువు విశాల నివాస ప్రదేశమును ఏర్పరచినాడు

5 తేజోవంత విష్ణూ ! నీవు స్తుతులకు స్వామివి జ్ఞాతవ్యుడవు నిన్ను తెలిసికొని నీ ప్రసిద్ధ నామమును కీర్తించుచున్నాము నీవు మహత్తువు నేను అణువును అయినను నిన్ను స్తుతింతును ఏలననగా నీవు రజోలోకపు ఆవలివాడవు

(అల్పానల్పములు రజోలోకమునకే పరిమితములు)

6 ఒకానొకప్పుడు విష్ణువు తనరూపము విడిచినాడు కృత్రిమ రూపము దాల్చినాడు యుద్ధమున వసిష్ఠునకు సాయము చేసినాడు ఇది ఆ సందర్భము .-

విష్ణూ ! నేను నిన్ను శిపివిష్ణ, నామమున పిలిచినాను దానిని స్వీకరించకుండుట బదులు పలుకకుండుట నీకు న్యాయమా? యుద్ధమున నీవు వేరు రూపము దాల్చినావు. మాముందు నీరూపమును దాచకుము

7 విష్ణూ ! నీ కొఱకు నోటితో నేను వషట్కారము చేయుదును కావున శిపివిష్ణూ! మా హవ్యము స్వీకరింపుము నా యొక్క అందమగు స్తుతి మఱియు వాక్యము నిన్ను వర్ధిల్ల చేయునుగాత *"యూయంపాత స్వస్తిభిః సదానః"*

(ఆంధ్ర వచన ఋగ్వేద సంహిత ఏడవ మండలము ఐదవ అష్టకమున ఆరవ అధ్యాయము సమాప్తము )

ఓం నతామినన్తిమాయినో నధీరావ్రతా దేవానాం ప్రథమాధ్రువాణి.
నరోదసీ అద్రుహా వేద్యాభిర్నపర్వతాని నమే తస్థివాంసః

ఏడవ అధ్యాయము — నూట ఒకటవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-పర్జన్యుడు, ఛందస్సు-త్రిష్టుప్

ఓం త్రిపోవాచః ప్రవదజ్యోతిరగ్రాయా పితద్దుహేమధు దోఘమూధః
వత్సం కృణ్వన్యర్భ మోష ధీనాం సద్యోజాతో వృషభోరోరవతి

1 అగ్రభాగమున విద్యుత్తు ఓంకారము గల ఋక్, యజుస్సామ త్రివిధవాక్యములు జలములను పితుకును ఆ వాక్యములనే పలుకుము పర్జన్యుడే సహవాసి అయి విద్యుదగ్నిని ఉత్పన్నము చేయును ఓషధులకు గర్భము కలిగించును వెంటనేపుట్టి వృషభమువలె గర్జించును.

(త్రిస్రోవాచః అనగా ద్రుత, విలంబిత, మధ్యమములు కూడ కావచ్చును)

2 పర్జన్యుడు ఓషధుల వర్ధకుడు జలవర్ధకుడు సకల లోకములకు ఈశ్వరుడు అతడు మాకు త్రిధాతుయుక్త గృహము, సుఖములు ప్రదానము చేయవలెను మూడు ఋతువులందు ఉండు సుందరగమనముగల జ్యోతిని మాకు ఇవ్వవలెను

(త్రీణివా ఆదిత్యస్య తేజాంసి వసంతప్రాతర్గ్రీష్మే మధ్యన్దినే శరదపరాహ్ణా ఇతి సూర్యునకు మూడు

తేజస్సులు ఉన్నవి ఉదయము వసంతము-పగలు గ్రీష్మము అపరాహ్ణమున శరత్తు)

3 పర్జన్యుని ఒక రూపము ఈత ఉడిగిన గోవు వంటిది మరొకటి జల వర్షకము అతడు తానుకోరుకున్నట్లు రూపములు ధరించును అతడు మాత పృథ్వి, పిత ద్యులోకము నుండి పాట స్వీకరించును అందువలన తండ్రి ద్యులోకము, పుత్రులగు ప్రాణి వర్గము వర్ధిల్లును

4 పర్జన్యుడు సకల భువనములందు ప్రాణులందు ఉన్నాడు అతడు ద్యులోకాది మూడు లోకములందు ఉన్నాడు అతని నుంచి మూడు ప్రకారముల తూర్పు, పడమర - దిగువ జలములు కలుగును అతడు నాలుగు దిక్కులను తడుపునట్టి మూడు తూర్పు, పడమర పైభాగపు మేఘములు వర్షించును

5 పర్జన్యుడు స్వయం ప్రకాశమానుడు ఈ స్తోత్రము అతని కొఱకే రచించబడినది అతడు దీనిని స్వీకరించవలెను మాకు సుఖము కలిగించు వర్షము కలుగవలెను పర్జన్యుడు అనుగ్రహించినవాని ఓషధులు పంటలు ఫలించును

6 వృషభమువలె పర్జన్యుడు సకల ఓషధులకు రేతస్సు జలము ఇచ్చును సమస్త స్థావర జంగమములు పర్జన్యునిలోనే ఉండును పర్జన్యుడు ప్రదానము చేసిన జలము నాకు నూరేళ్ళ ఆయువునిచ్చి రక్షించవలెను *"యూయంపాతస్వస్తిభిః సదానః"*

## నూట రెండవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-పర్జన్యుడు, ఛందస్సు-గాయత్రి

1 స్తోతలారా ! అంతరిక్షపుత్రుడు, సేచకుడు పర్జన్యుని కొఱకు స్తుతులు గానముచేయండి

2 పర్జన్యుడు ఓషధులకు, గోవులకు, అశ్వములకు స్త్రీలకు గర్భాదానము చేయును

3 పర్జన్యుని కొఱకు దేవతల ముఖమగు అగ్నిలో రసవంత హవ్యమును హవనము చేయండి అతడు మనకు అమిత అన్నము ఇవ్వవలెను

## నూట మూడవ సూక్తము

ఋషి-వసిష్ఠుడు, దేవత-మండూకము, ఛందస్సు-మొదటిది అనుష్టుప్, మిగిలినవి త్రిష్టుప్.

1 బ్రాహ్మణుడు ఒక సంవత్సర పర్యంతము వ్రతము చేయును అట్లే మండూకము సంవత్సర పర్యంతము శయనించును అప్పుడు పర్జన్యుని ప్రసన్నుని చేయుటకు పలుకును

(కప్పలు బెకబెలాడిన వర్షము వచ్చునని ప్రతీతి)

2 మండూకము ఎండిన చర్మమువలె సరోవరములందు పడుకొని ఉండును వాటి వద్దకు వర్షజలము వచ్చినపుడు లేగదూడవలె కలకలారావము చేయును

3 వర్షకాలము వచ్చును పర్జన్యుడు ఎదిరిచూచిన, దప్పిగొన్న కప్పలను నీటముంచును బూడిబడి పలుకులతో తండ్రివద్దకు పోవుకొడుకువలె ఒక కప్ప మరొక కప్ప వద్దకు చేరును

4 వర్షము పడినపుడు రెండు జాతుల కప్పలు సంతోషపడును పర్జన్యుడు కురిపించిన వర్షమును పొడవగు గంతులు వేయును బూడిదరంగువి ఆకుపచ్చవానితో కలిసి ధ్వనులు చేయును ఆ సమయమున ఒక కప్ప మరొకదానిని అనుగ్రహించును

5 శిష్యుడు గురువును అనుకరించినట్లు మండూకములు ఒకదాని ధ్వనిని మరొకటి అనుకరించును మండూకములారా ! మీరు సుస్వర శబ్దములు చేయుచు నీటిమీద దూకునపుడు మీ శరీరపు కీళ్లు సరి అగును

6 కప్పలలో ఒకటి ఆవువలె, మరొకట మేకవలె అరచును ఒకదానిది పొగరంగు మరొకదానిది పచ్చరంగు పేరు అన్నింటిది ఒకటే కాని రూపములు అనేకములు అవి నానాదేశములందు ధ్వనులు చేయుచు కనిపించును

7 మండూకములారా ! అతిరాత్రి సోమయజ్ఞమున బ్రాహ్మణమువలె నిండిన కొలనులో బెకబెకలాడుచు నలువైపుల విహరించండి

8 సోమయుక్తము మరియు వార్షిక స్తుతులు చేయు విప్రులవలె మండూకములు శబ్దము చేయును స్వేదము నిండిన ఋత్విక్కులవలె తడిసినట్లున్న కప్పలు వేడికాలమున కన్నములందుదాగి వర్షకాలమున బయటపడును

9 మండూకనేతలు ప్రకృతినియమములను కాపాడును అవి పన్నెండు నెలలు ఋతువులను వృథాకానివ్వవు ఏడాది పూర్తికాగా వానకాలమురాగా ఎండవేడికి మ్రగ్గిన కప్పలు గుంతల బంధనములు విడిపించుకొనును

10 ఆవువలె అరుచు మండూకము మాకు ధనము ఇవ్వవలెను మేకలవలె అరుచు మండూకములు మాకు ధనము ఇవ్వవలెను బూడిద రంగువి మాకు ధనము ఇవ్వవలెను పసుపురంగువి ధనము ఇవ్వవలెను వేల పంటలు పండించు వర్షకాలమున మండూకములు మాకు అసంఖ్యాక గోవులను ఇచ్చి మా ఆయువును పెంచవలెను

(ఇది పరిహాసమా? కప్పనుకూడ కీర్తించ వచ్చునని చెప్పుటయా? వినోదమా?)

## పదకొండవ సూక్తము

ఋషి-కణ్వపుత్రుడు వత్సప్యుడు దేవత-అగ్ని, ఛందస్సు-గాయత్రి చివరిది త్రిష్టుప్.

1 అగ్నీ ! నీవు మానవుల కర్మ రక్షకుడవు అందువలననే యజ్ఞములందు నిన్ను స్తుతింతురు

2 శత్రుపరాజయకారి అగ్నీ ! నీవు యజ్ఞములందు కీర్తనీయుడవు యజ్ఞములనేతవు

3 జాతవేద అగ్నీ ! మా శత్రువులను వేరుచేయుము దేవద్వేషులను శత్రువులను వేరు చేయుము

4 జాతవేద అగ్నీ ! శత్రువు సమీపమున యజ్ఞము చేయుచున్నాను అటుతొక్కవు

5 మేము విప్రులము నీవు అమరజాతవేదవు మేము నిన్ను విస్తృతముగా స్తుతింతుము

6 మేము మానవ విప్రులము అగ్నికి హవ్యము సమర్పింతుము ప్రసన్నుని చేతుము మా రక్షకొఱకు అగ్నిని స్తుతింతుము పిలుతుము

7 అగ్నీ ! ఉత్తమ గృహము కన్నను వత్సఋషి మమ్మ ఎక్కువగా ఆకర్షించును అతని స్తుతి నిన్ను కోరును

8 నీవు అనేక దేశములందు సమానముగా దర్శనమిస్తావు అందుకేనీవు సకల ప్రజలకు స్వామివి యుద్ధములందు మేము నిన్ను పిలుచుచుందుము

9 మేము అన్నాభిలాషులము మమ్మ రక్షించుమని యుద్ధమున అగ్నిని ఆహ్వానిస్తాము యుద్ధములందు అగ్ని విచిత్ర ధనయుక్తుడగును

10 అగ్నీ ! నీవు యజ్ఞమున పూజ్యుడవు ప్రాచీనుడవు నీవు చిరకాలముగా హోతవు స్తుతింపదగినవాడవు యజ్ఞములందు ఆసీనుడవగుదువు నిన్ను హవితో తృప్తిపర్చుకుందువు

11 అగ్నీ ! మాకు సౌభాగ్యము ప్రదానము చేయుము

- ఇయ్యది -

*శ్రీవత్సస గోత్రోద్భవుండను, దాశరథి లక్ష్మణాచార్య బుచ్చమాంబల పౌత్రుండను, విద్వాన్ వెంకటాచార్య వెంకటాంబల పుత్రుండను, ఆంధ్రదేశ ఆస్థానకవి దాశరథి కృష్ణమాచార్య అనుజుండను శ్రీ॥ లI॥ సౌ॥ కమలానామ్మి ధర్మపత్నీ సమేతుండను "చిల్లెర దేవుళ్లు - మోదుగుపూలు - పావని - చలనచిత్ర రచయితయు - శరతల్పం - కొత్తకాపురం - వింత సంసారం - తూరుపు తెల్లవారింది - రంతిదేవుడు - అఖండదీపం - దొంగసామ్మ" దూరదర్శన సీరియల్ రచయితయు అగు దాశరథి రంగాచార్య రచించిన ఆంధ్రవచన ఋగ్వేద సంహిత యందలి అయిదవ అష్టకము సమాప్తము*

*"యదింద్రదల్యాత్వమేతా దహమవేయ స్తోతారమిద్ధి ధిషే యరదావసోన పావత్వారానయ"*

- ఇతిశమ్ -